నీకు గలిగె పడునను పోకిన లోహము కాంచన మైనట్లు కృష్ణమాచార్యులు విన్న చేపట్టగానె కృతార్థుండనైతి నవిన సింహాద్రిప్పలు యేసుకు చున్నాడు దేవ! కృష్ణమాచార్యులకు యిచ్చిన వైకుంఠంబు నీవు యిద్దరికిన్ని యిచ్చితి గావయని వైకుంఠంబు అతయు మిచ్చెనె దా యీ సంకీర్తన శివ భక్తు లాయె నేమి, విష్ణుదాసు లాయె నేమి యెవ్వరు చదివిన యెవ్వరు భక్తితో విన్న, యెవ్వరు వ్రాసిన పాపపరిహారంబవును అటుమీదట కామంత్ర్య ముంగున వైకుంఠం బిచ్చును నీయాన నీ చరణంబు లాన మా తిరుమణి తిరుమార్గంబులాన మా గురువు లాన మా శ్రీకృష్ణకుమారస్వామి సింహగిరి నరహరి నమోనమో దయానిధీ!"

* * * *

*"దేవా! కృష్ణమాచార్యులు వోరుగంటిలో పతివ్రతాగృహంబున కేగిన ఆ యింటి బ్రాహ్మణుండు దండ ప్రణామంబు జేసి 'స్వామీ! మీరు విజయంజేసుట నా గృహంబు పావనం బాయను నేను కృతార్థులమైతిమి మా యింట అరగించి మమ్ముల రక్షించుమని విన్నపంబుజేసిన కృష్ణమాచార్యులు యేమనుచున్నారు 'నీవు ఏక పత్నీ వ్రతుండవు విత్యాను సంధాన సంపన్నుండవు సకల గుణసంపదలు గలుగు ధన్యుండవు బృందావన మునకు విజయంజేసిన పిమ్మట మీ యింట నార గించెదననిన బ్రాహ్మణుండు తులసీమాహాత్మ్యం జెప్పు మనిన ఆ బ్రాహ్మణునకు తులసీమహాత్మ్యంబు యిట్లు చెప్పంగొణంగె ఏకసమయమందు తులసీ దర్శనంజేసినవారికి శిశుహత్య, గోహత్య, స్త్రీహత్య, మొదలైన పాతకంబులుపోవును తులసీకంపఅయినా కట్టె సంరక్షణ జేసినవారికి వేయిసంవత్సరంబులు సాయుజ్యపదంబులుగలుగును తులసికి కోటవేయించి కొమ్మలు దీర్చిన పుణ్యాత్ములకు అశ్వమేధ ఫలంబు గలుగును తులసికి దీపం యిచ్చినవారికి సూర్యచంద్ర లోకంబులు గలుగును తులసికి రాగి, వెండి, బంగారం బుల ప్రాకారంబులు దీర్చిన పుణ్యాత్ములకు శాశ్వతం బుగా విష్ణులోకంబు గలుగును తులసికి నీరాజనంబు సమర్పించినవార్కి బ్రహ్మలోకంబు గలుగును తులసి కోటకు గోమయంబులు దీర్చి అలికినవారికి శత సంవత్సరంబులు స్వర్గంబు గలుగును తులసికి నమస్కారంబు జేసినవారికి నాలుగులోకంబులు గలుగును తులసికి నైవేద్యంబులు సమర్పించినవారికి కామ్యంబు గలుగును నీళ్లుపోసి పెంచినవారికి జల బిందువు లెన్ని కలుగునో అన్ని సంవత్సరములు పుణ్యలోకంబులనుండి విష్ణుసాయుజ్యంబు పొందు దురు నిత్యకృత్య నమస్కారంబుజేసి పూజలు జేసినవారికి వైకుంఠంబు గల్గును. తులసికి మంత్ర పుష్పమున్ను యజ్ఞోపవీతమున్ను సమర్పించినవారికి బ్రహ్మలోకంబు గలుగును తులసికి వస్త్రములున్ను, మణులున్ను సమర్పించినవారికి స్వర్గలోకంబుగల్గును తులసికొద్ద ముగ్గు లుంచినవారికి అగ్నిష్టోమఫలంబు గల్గును తులసికి మొదట అరుగు జేసినవారికి అష్టైశ్వర్యంబులు గలుగును తులసి మొదట మృత్తిక ధరియించినవారికి లలాటలోచనుని దర్శనంబు గలుగును తులసిపూజలు అష్టాక్షరి ద్వాదశాక్షరీజపంబు జేసిన పుణ్యాత్ములకు అష్టపుత్రులు గలుగును ద్వాదశి దినంబున వైకుంఠంబు గాంతురు తులసీదళంబుల కేశవాయి పూజజేసినవార్కి శంకరలోకంబు గలుగును తులసిదళాన తీర్థపానం జేసినవార్కి సకల తీర్థంబులయందు గాంగాది నదులయందు స్నానంబు జేసిన ఫలంబు గలుగును దేవా! తులసీదళంబు శిరస్సున ధరించినవారు త్రిలోకాలకు అధిపతులై జన్మింతురు. ద్వాదశి దినంబున తులసీవ్రతంబు జేసిన వారు ద్వారకానగరంబున అధిపతులై జన్మింతురు తులసీబృందావనంబు అలికి ముగ్గుపెట్టి స్నానం సంధ్య జపములు దీర్చుకుని మంత్రపుష్పాంజలులు, ధూపదీప నైవేద్యంబులు సమర్పించినవారికి యింట నిత్యోత్సవ పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవ సంవత్సరాదులయందును సకలమైన భోగభాగ్యదులు సంపదలు గలిగి శుభశోభనంబులు గలిగి యుందురు. తులసి బృందావనానకు నారికేళ కదళీ ఖర్జూరఫలంబులు సమర్పించినవారికి కైలాస సన్నిధానంబు గలుగును తులసి బృందావనానకు దంపతి సమేతంగాను మూడు ప్రదక్షిణంబులు జేసి సాష్టాంగ దండప్రణామంబు లాచరించినవారికి అనేక కాలాల

---

* తూకళ మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున *R* 447 అను సంఖ్యలో నున్న ప్రతి లోనిది—

యందున్ను సకలమైన సంపదలు గలిగి జన్మ జన్మాల యందు వుత్తమకులంబులయందు జన్మింతురు తులసి బృందావనమునకు భక్తిపూర్వకంబుగా యథాశక్తి తాంబూల నైవేద్యంబులు జేసినవారికి భూలోకంబు రాజ్యపాలనంబు చేసి విష్ణు సన్నిధానంబు నొందుదురు సాయంకాల సమయంబులయందు తులసికి దీపంబిచ్చిన స్త్రీలకు కోరినకోరిక గలుగును తులసి బృందావనంబునకు అలికి ముగ్గు దీర్చి ఆ సాయంకాలమందు ఆరతి యిచ్చినస్త్రీలకు శాశ్వతంబుగా అయిదవతనంబు గలుగును సంతానప్రాప్తి గలిగి సంతోషంబున నుందురు దేవా! అంత్యమందు తులసీదళోదకం యిస్తే దేహం పవిత్రంబై సద్గతి గలుగును దేవా! తులసీ మహాత్మ్యం పఠియించిన వారికి కొన్ని జన్మాదులు గడచిపోగాను శాశ్వతంబుగా కైలాససన్నిధానంబు గలుగును తులసీవనమందు వున్నదళందెచ్చి శిరస్సున ధరించినవారికి త్వరితంబుగా ఆదిత్యపురంబు గలుగును ప్రొద్దున లేచి తులసీ దర్శనంబు జేసిన వారికి పాపంబులు దొలగును ఈ కథ కృష్ణమాచార్యులు సంకీర్తన కాయగా తకయింట నలువురుకోడళ్లు నీళ్ల కడవలు తీసుకువస్తూ వుండిన వేళ ఆయింటి పెద్ద కోడలు యీ సంకీర్తన విందా మనెను రెండో కోడలు పూర్ణకడవలు దించుకొని విందామనెను కడమ యిద్దరుకోడళ్లు యీ సంకీర్తన లేవి. యీమాటలకేమి పోదాము రమ్మనిరి. కనుక యీ సంకీర్తన విందా మన్నకోడలు భూమండల మేలే రాజా కొడుకై జన్మించెను పూర్ణకుంభములు దించి విందా మన్నకోడలు చక్రవర్తియై జన్మించెను కడమ యిద్దరు యిక్కడ సంకీర్తన వినక పోదాము రమ్మన్న కోడళ్లు అనామికులయింట నూరు జన్మంబులు పందులై జన్మించిరి కనుక యీదివ్య నామస్మరణ నెవరు వ్రాసినా, నెవరు చదివినా, నెవరు పఠించినా, నెవరు విన్నా గోసహస్రదానంబులు చేసిన ఫలంబు గలుగును పితృపితామహులు విష్ణుసాయుజ్యంబు గాంతురు సకల దోషములున్ను సర్వత్రా తా జేసినపాపములున్ను నివారణమై ఆపదలు దొలగును ఆయురారోగ్య ఐశ్వర్యంబులు గలుగును పుత్రపౌత్రాభివృద్ధి గలుగును"

* * * *

"ఏమారి రజకునియింట మృతానుజు
నహపించె కిత్ర కౌనవంబుననుక
నా బ్రహ్మరుద్రుల కైన గన్పడనట్టి
నృహరి నాడించెను నిత్య మెవ్వ
డతనికాపమున సర్వసని నుకిరైన
నేపహాములు కాలె నెకరిక"

అనాంటి కృష్ణమాచార్యులు రచించిన యీ 'తెలుగువేదం' త్వరలో ప్రకటింపబడితే అది తెలుగు వాఙ్మయానికి ఒక విశిష్టాలంకారం అవుతుంది!



# సంగంవారి వీధి



శ్రీ ఇవటూరి కామేశ్వరరావు

ఆ పూళ్లో చంగల్రావ్ హోటలుకు వచ్చే జనం ముచ్చటించని సంగతంటూ లేదు. దైవందిన పత్రికలలోవార్తలనుంచి, కాంగ్రెసు ఎలక్షనులు, బ్లాకు మార్కెట్టు, సమ్మెలు—అబ్బో ఒక టేమిటి సమస్త సంగతుల గురించి ప్రస్తావించడం పరిపాటి. పూళ్లో ఏదైనా చావు సంభవిస్తే ఆ ప్రస్తావం అక్కడే.

పెళ్లిళ్లు, పేరంటాలు జరిగితే వాటి వార్తలు అక్కడికు వెంటనే చేరుకుంటాయికదా. కోర్టులో ఏదైనా మంచి కేసు విచారణకు వస్తే దాని ఫలితాలను గురించి యిక్కడే చర్చ జరిగితీరుతుందిగదా. బళ్ళో చెప్పేవారు గాను ఎవరికైనా నంచో బెట్టారంటే ఆ విషయం అక్కడ చర్చించుకోవలసిందే గదా. ఆ రోజు సంతలో మిరపకాయ ధర హెచ్చిందంటే దానిని గురించి అక్కడ ప్రస్తావన జరగవలసిందే. ఇలాగ్గా చిత్రవిచిత్రంగా సాగిపోతుంటాయి సంభాషణలు. చెంగల్రావు కూడా ఏకత్ సంభాషణల మధ్య తనకు తోచినట్టు ఒక్కొక్క విసురు విసురుతూండం పరిపాటి.

చెంగల్రావుకొట్టుకు అనుదినమూ హాజరు వేసుకునే వాళ్లలో — ఆ ప్రక్క ఫ్యాక్టరీ ఫోర్మను ఒకడూ, అగ్రహారంలో వుండే శాస్త్రులవారొకరూ, గవర్నమెంటు గ్రాంటుయిచ్చిన ఎయిడెడ్ స్కూలు అయ్యవారు, అయ్యవారమ్మగారూ ఒకయిన్స్యూరెన్సు ఏజంటు ఒకాయన వీళ్లు హాజరు కావలసిందే. అలా వర్షం కురవనీయండి—ఈలా ఎండలు ముదిరి ఘూద్పులు వేయనీయండి—ఏదో ఒక సమయంలో హాజరు వేసుకొని పిచ్చాపాటి మాట్లాడుకొని పోతుంటారు.

తరుచు సుబ్బన్న కూడా ఆ దుకాణంకు రావడం కద్దు. మోతుబరి సుబ్బన్నంటే ఆ పూళ్ళో చాల మందికి తెలుసు. ఘరానా మనిషి. నిత్యమూ ఇతని కూడా ఇద్దరో ముగ్గురో తోకల్లా తిరుగుతూనే వుంటారు. తన మాటకు అడ్డంవస్తే సహించే ఘటం కాదు. వాడితోపాటే వాడి అనుచరులు కూడా. ఒక మాట అతనితో ఘర్షణ పడితే ఏం విపత్తు సంభవిస్తుందోనని సౌమ్యంగా పోతుంటాడు చెంగల్రావు. ఎందుకంటే వెనుక ఒకటి రెండుసార్లు అక్కడ కొట్లాటలు కూడా జరిగి తలలు పగులగొట్టుకునేంత పని జరిగింది. అందులో మోతుబరి సుబ్బన్నతో చేయి చేసుకుంటే ఆ రోజు నెత్తురు చూశారన్నమాటే.

యధావిధిగా ఫ్యాక్టరీ ఫోర్మను పోతూపోతూ తను మామూలుగా కూర్చునే బల్లమీద కూర్చుని యింత కారప్పూస తింటున్నాడు పెట్టించుకొని. గ్రాంటుస్కూలు బడిపంతులు, అయ్యవారమ్మ బడి తలుపు బిగించుకొని రవంత యేమైనా తినిపోదామని చంగల్రావుదుకాణానికి దక్కొచ్చి ఫ్యాక్టరీ ఫోర్మను ఎదురుగుండా ఉన్న బల్లమీద కూర్చుని చెరొక ప్లేటు బూంది తినసాగారు.

ఫ్యాక్టరీ ఫోర్మను యుద్ధంనుంచి తిరిగివచ్చిన వ్యక్తి. లావుగా పొట్టిగా ఉంటాడు. పిల్లికళ్లు జుట్టు ఎప్పుడూ ముందరకు నుదిటిమీదకు వస్తుంటే పదేపదే వెనక్కు తీసుకుంటూంటాడు. ఇన్స్యూరెన్సు కంపెనీ యేజంటు బక్కపలచగా పొడుగ్గా ఉంటాడు. ఇతగాడు 24 ఘంటలూ సైకిలుమీదే తిరుగుతూంటాడు. ఓ పది నిముషాలు తీరిక చిక్కిందంటే చెంగల్రావు కొట్టులో ఉండి తీరవలసిందే. ఇక పోతే అయ్యవారూ, అయ్యవారమ్మదీ ఒకే అదృష్టం. వీళ్లది అసలు దానవాయిపేటలో మకాం. మాలవాడంతా వీళ్ళంటే విపరీతమైన గురి. ఇద్దరూగూడా ట్రైనింగ్ అయినవారేమో. చెరో 50 రూపాయలు సంపాదించుకుంటున్నారు. యిప్పుడంటే వుద్యోగాలు సంపాదించారుగాని, వెనుక వీళ్ళ తాత ముత్తాతలు పురపాలక సంఘంలో చీపుళ్లు పట్టి తమ పొట్టలను బళ్ళబోసుకునేవారు. కాని నేటి గాంధియుగంలో 'మాల' అనే పదంపోయి దాని స్థానే హరిజన అనే పేరు రావడంతోటే పరిస్థితులన్నీ తారుమారై పోయాయి.

ఇంతకీ విషయ మేమిటంటే ప్రక్కన రెండు ఫర్లాంగుల దూరంలో ఉన్న దూపాటివారి వీధిలో బ్రాహ్మణ దొడ్డమ్మగారు ఆ క్రితం రోజు పోయారట 60 ఏండ్లుంటాయట

ఫోర్మన్ పాపం చాలా ధర్మాత్మురాలట అనేక ధర్మాలు కూడా చేసిందట

ఏమైంటు ఆమె ఎవరినో పెంచుకుందట, అతను తాలూకాఫీసులో పనిచేస్తున్నాడట ఆ లోగిలీ 4 ఎకరాల భూమి అతగాడికి వ్రాసి యిచ్చేసిందిట

అయ్యవారమ్మ ఏం జబ్బుటండీ పాపం హఠాత్తుగా పోయిందట?

ఫో గుండెజబ్బుట అందులో ఈ గుండె జబ్బు చాలా విపరీతమైనటువంటిది మాట్లాడుతూనే ప్రాణం పోవడం, పడుకుని తెల్లవారేసరికల్లా హంస లేచిపోవడం, స్నానం చేస్తూనే హరీ అంటూండడం ఈలాగా కర్ణకఠోరంగా వుంటూంటాయి, ఈ గుండె జబ్బు కేసులు.

అయ్యవారు ఏ వీధిలోనండీ ఆమె నివసిస్తున్నది?

ఇ ఏ ఏ వీధేమిటి — (యిక్కడే దగ్గరలోనే) దూపాటివారి వీధి—అంటే.

ఫో అంటే ఆ పెద్ద రావిచెట్టు ఉన్నది అదా—

ఏ అది కాదనుకొంట్ల అది సంగంవారి వీధి ఎక్కడో చర్చిదగ్గర ఉన్నదాన్ని తీసుకువచ్చి యిక్కడ యిరికిస్తావేమిటి?

ఫోర్మను సంగం వారి వీధిలోనూ రావిచెట్టు లేదనుకున్నారా?

ఏ ఉంది నేనన్నది పెద్ద రావిచెట్టు. సంగం వారి వీధిలో ఉన్నది దీనికంటె చిన్నది.

అయ్య యింతకీ సంగంవారి వీధి ఎక్కడుంది మీకు తెలుసా?

అయ్యవారమ్మ సంగంవారి వీధే తెలియదట. నే బళ్లో చదువుకునే రోజుల్లో మా అమ్మ నిత్యమూ ఈ వీధిలో కమ్మవారింటికి ఏదో పనిమీద వస్తూండేది

అ, అచ్చు ఆఫీసు వుండే దాని ప్రక్క వీధే 'ఇంతకీ' ఫ్యాక్టర్మేన్ ఫోర్మను కళ్లు చిట్లించుకొంటూ గొంతుక సవరించుకొంటూ 'సంగంవారి వీధినే అష్ట వంకర్ల వీధి అంటారు అసలు కోనంగిపేటలోంచి వచ్చేవీధి సంగంవారి వీధిలో కలుస్తుంది'

అయ్య అచ్చే ఎక్కడ కోనంగిపేట ఎక్కడ సంగంవారి వీధి? సంగంవారి వీధి మన పాత సినిమా ఉంది దాని వెనకాల వీధి దాని ఉత్తరం వైపుని చర్చికూడా ఉంది అంతేకాని ఈ ఫోర్మను గారికి అసలు—

ఫోర్మను అందుకుని—వారు తెలుసండీ అబ్బ సంగంవారి వీధి ఎక్కడుందో వారు తెలిసినట్లు మరెవ్వరికీ తెలియదు

ఇ ఏ అచ్చే బ్రాహ్మణపేటను వివరాలగా రైలుగేటుకు యివతల ఉందండీ ఏమిటో వారు తెలియనట్లు మీరు వాదిస్తారు

అయ్యవారమ్మ (చేతులు కదుపుకుంటూ) అబ్బ ఏమిటే గొడవ ఇంతకీ సంగంవారి వీధి ఎక్కడుందంటారు

ఇంతలో వెంగళ్రావు లోపల నుంచి వచ్చి — సంగంవారి వీధిని గురించేనా మీరు అనుకొనేది నా చిన్నతనంలో మా ముసలమ్మవాళ్ళు ఆవీధిలోనే కాపరం ఉండేవాళ్లట. మా తండ్రికి ఋణం ఉండడంచేత ఆ యిల్లూ వాళ్లకే వాళ్ల పరమైపోయింది లేకపోతే నాకే అద్దె కొంపే మొచ్చు అది అచ్చాఫీసుకు తూర్పువైపున ఉంది'

అగ్రహారంలోని ముసలాయన ఎప్పుడు వచ్చాడో వచ్చి, తాను మాయలుగా కూర్చొని చోటునుంచి ఈ సంభాషణ వింటున్నాడు అయినా సంగంవారివీధి ఎక్కడుంటే తనకేం గావాలి, ముందు తన పొట్ట నిండాలి గాని— యీ విధంగా సంగంవారివీధి ఉత్తరంవైపున ఉందని ఒకరూ, చర్చికి పడమటిభాగంలో ఉందని మరొకరూ, అచ్చు ఆఫీసు వెనకాల ఉందని వేరొకరూ యిలాగా వాండ్లు అనేక విధాలుగా తర్కించుకొంటూ ఇంకా విస్తారగానే వచ్చేలోపున సుబ్బన్నా మరోయిద్దరు వ్యక్తులు లోపలికి వచ్చి వీరందరికీ కుడివైపున కూర్చొని యిన్ని పేడిరకోడీలు అర్థరిచ్చారు.

ఇన్నాళ్ళకు ఏమైంటు సుబ్బన్నను చూచి 'యిదుగో పాతకాపు సుబ్బన్న వచ్చాడు [illegible]

తెలియం దేమంది గనుక యేమేరాయ్ సుబ్బన్నా సంగంవారివీధి ఎక్కడుందో చెప్పు.'

సు సంగంవారివీధే తెలియదూ విచ్చేదా! నాకు బాగా తెలుసు ఎందుకంటే మా అత్తగారు వెనుక అబ్బు చేసి ఆ వీధిలోనే పోయింది కాలువకు దక్షిణంగా ఉంది ఆ వీధిలో నుంచే రైలుగేటు కూడా కనిపిస్తుంటుంది

యింతవరకూ ఆ ప్రసంగంలో జోక్యం కల్పించుకోని ముసలాయన లేచి

అన్నీ మీరంతా చెప్పేవది అసలే తప్పు రైల్వేగేటువుల దేవాలయానికి ఆనుకుని ఉన్న వీధే సంగంవారి వీధి

సుబ్బన్న మహా చెప్పావులేవయ్యా, పాడు గాటి ముక్కు నువ్వూను నే సెక్కడుందో చెప్పా నగా మళ్లీ నువ్వు అది కాదంటావేటయ్యా అయినా మధిలోడవ్ నీ కెందుకు ఈ గొడవ నీవు నీ పాడుం కానేమిటో నీ చేమిటో అంతే కాని——

ఫోర్మన్ అయితే నే చెప్పింది తప్పంటారా బలే వాళ్లు! అసలు సంగంవారి వీధికే అష్టవంకర్లవీధి అని పేరు కోణంగిపేటలోంచి అచ్చు ఆఫీసువద్ద కలిసేదే అంటే మీకు నమ్మకం

మా సు నీవు చెప్పిందల్లా నమ్మాలి అది ఉంచా ఏమిటి? సంగంవారివీధినిగురించి నీకేం తెలుసు నిన్న గాక మొన్న టివరకూ యుద్ధంలో ఏడుస్తూ——

ఫో ఫలానాచోటున ఉందని తెలపడానికి నాకు స్వాతంత్ర్యంఉంది మధ్యలో నువ్వేమిటి? ఏడుస్తూ గీడుస్తూ రానీయకు మాటలు సరిగా రానియ్యి ఏమనుకున్నావో

సు ప్రతీదీ నీకు తెలుసునని వాదిస్తావేమిటి? మహా తెలిసినట్టు ఏంచేస్తావేమిటి? ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసుకుని మరీ మాట్లాడు అట్టే మాట్లాడితే

ఏ. అట్లే మాట్లాడితే ఏం చేస్తావేమిటి! ఫోర్మను ఒక్కడికే అనుకుంటున్నావేమో మీద చెయ్యిపడితే ఊరుకునేది లేదు. జాగ్రత్త అన్నాడు

అసలు దెబ్బలాట అనిపోకు గాని యింతలోకి

అయ్యవారమ్మ: ప్రతీదీ వికృత తెలుసు కనుకుంటారు. ఈ సుబ్బన్న మరీని అబ్బ! యింతటి మొండివాణ్ని ఎక్కడా చూడలేదు

సుబ్బన్న వట్లు వేడెక్కి ఫోర్మనూ సుబ్బన్నా కొట్టుకోవడం ప్రారంభించారు గ్లాసులు విసిరేసు కున్నారు ప్రక్కనే ముసలాయన కర్రపెట్టుకుంటే అది ఊడలాక్కుని వీపుమీద వేశేసు సుబ్బన్న. ఫోర్మను కుర్చీ పైకెత్తి విసిరాడు, దెబ్బ తప్పించుకుని, ఇటుపైపు వచ్చి ఒక తాపు తన్నాడు సుబ్బన్న. ఆ దెబ్బలో ఫోర్మను పెనక్కువెళ్ళి గుమ్మం నుదుటికి తగిలి రక్తం ప్రవహించసాగింది సుబ్బన్నతో ఉన్న తలిమ్మా యిద్దరూ అయ్యవారినీ, అయ్యవారమ్మనీ కర్రతో వాలుగురికి ఒక్కొక్క తోపు తోశారు. అయ్యవారమ్మకు దెబ్బతగిలి పడిపోయింది ఆ పన డంలో గ్లాసుమీద పడిందేమో బద్దలయిన గ్లాసు అందు తగిలి మోచెయ్యి గీసుకుపోయింది

తన లాంగుబాటులోకి ఆసుకురాలేక చంగ్రలావ్ వీధిలోకి పోయి వారినీ వీరినీ కేకలు పెట్టడం ప్రారంభించాడు ఈ కొట్లాట కృటికాలంలో జరిగిపోయింది ఆ గలాభా ఈ కేకలు విని బీటు తిరుగుతున్న పోలీసు కనిస్టెబిలొకడు అక్కడకు వచ్చాడు. కాని ఈలోగా సుబ్బన్నా—వాడి అనుచరులు అక్కడినుంచి దాటుకున్నారు దెబ్బలుతిన్న వాండ్లకు నెత్తురు కారుతుంటే బంగారెత్తి చూడలేక మ్యునిసిపలు ఆసుపత్రికి తీసుకొనిపోయి వాండ్లకు కట్లు కట్టించడం నిమిత్తం చంగ్రలావు ప్రక్కనే ఉన్న బండిని పిలవడానికి వెళ్లాడు యింతలో యీ కొట్లాట విషయం పాక్కి జనం గుమిగూడి చివరికి సబ్ ఇనస్పెక్టరూ సిబ్బందీ తయారైనారు జరిగిన సంగతంతా చంగ్రలావు వద్దనుంచి సంబాయిషీ తీసుకున్నారు అక్కడ వున్న అందరిస్టేటుమెంట్లు పుచ్చుకొన్నారు వాండ్లను ఆస్పత్రికి తగిన చికిత్సకై పంపించారు.

మూడు రోజులపాటు ఈ వీధేమిటి—ఆ వీధేమిటి ఊరూవాడా గాలించేశారు సుబ్బన్నకోసం ఈ సందట్లో ఆ రాత్రి మరి ఎలా అంటుకుందో ప్రక్కనే ఉన్న పాకోన్సికొట్లు అంటుకుని కొన్ని వందల రూపాయల నష్టమైపోయింది. కొట్టులో హార్లొండ్లు, ఒకటి రెండు కుంచి వీలలు, యితర సామా

సులు అన్నీ ధ్వంసమైపోయాయట వాకబు చేయగా తెలిసిందేమిటంటే అది ఫోర్మన్ స్వంత అన్నగారి కొట్టు అనీ, ఫోర్మన్‌పై కోపంచేత ముప్పన్న ఆ రాత్రే అంకినమటుక్కి డబ్బు తీసుకొని ఆ కొట్టుకు నిప్పంటించి తగలబెట్టాడని చెబుతారు

## 2

దొమ్మీ కేసు కోర్టుకు ఎక్కి మేజస్ట్రీటు సదాశివరావుగారి ఎదుట విచారణకు వచ్చింది దొమ్మీ కేసును గురించీ, అందుకు సంబంధించిన వ్యక్తుల వాఙ్మూలాలను గురించి యితర పరిశీలనలను గురించి కొంతసేపు చర్చ జరిగింది పిమ్మట దొమ్మీ జరిగిన రోజున సాక్షిసాక్ష్యాలలో మొట్టమొదట ఈ దొమ్మీ ఏ విధంగా ఆరంభించినదీ దాని విచారణ జరుగుతోంది

లా చదివిన ధర్మారావు అదివరకే కోర్టులో మంచి పేరు సంపాదించుకున్నాడు క్రాస్ ఎగ్జామిన్ చేయడంలో అతడికతడే సాటి అతని విచారణలో చాలా కేసులు చిక్కువిడి తీర్పుకు వచ్చాయి

ధర్మా సంఘటన జరిగిన సాయంత్రం నీవు అయ్యవారూ, ఆ ఫ్యాక్టరీ ఫోర్మనూ మాటలు యజమాని చంద్రగలావు—ఇంకా ఎవరో ముసలాయన టిఫిన్ పుచ్చుకుంటూ అక్కడ వున్నారట నిజమేనా?

అయ్యవారమ్మ నిజమేనండి

ధర్మా మీరు ఆ రోజున దేనినిగురించి మాట్లాడుకుంటున్నారో మేజస్ట్రీటుగారితో చెప్తారా?

అయ్య రోగాలనుగురించి మాట్లాడుకుంటున్నామండి

ధర్మా సంభాషణలో ఎవరికైనా భేదాభిప్రాయాలు వచ్చాయా?

అ అమ్మ సంగంవారివీధి ఎక్కడవున్నదీ అనే విషయాన్ని గురించి మేము తర్కించుకోవడంలో

మేజ సదాశివరావుగారు తల ఉటంకించి, కళ్ళజోడు బల్లమీదనుంచి తీసి అద్దాలు తుడిచి గొంతు సవరించి,

'దేనిని గురించి' అన్నారు న్యాయమూర్తి

సాక్షి అది సంగంవారి వీధి ఎక్కడ వున్నదనే విషయాన్ని గురించి తర్కించుకుంటున్నాము

మేజ సంగంవారి వీధా?

'చిత్తం సార్'

'అయితే ఏదీ ఆ సన్నటిసందు ఉన్నదే—అదేనా—ఆ సినీమా థియేటరు ప్రక్కగుండా వెళ్ళే సందేనా?

ధర్మారావుకు ఒక విధమైన నవ్వు వచ్చింది మేజస్ట్రీటుగారు చెప్పిన అంశం కొద్దిగా సత్యదూరంగా వున్నది

ధ 'చిత్తం తమరు సెలవిచ్చిన వీధిని గురించే సాక్షి చెపుతున్నది తమరు అనుమతిస్తే ఆ వీధి పరిసరాలను గురించి తెలుపడానికి అవకాశం ఇస్తారని మనవి

మే 'ఏమిటా పరిసరాలు' అన్నారు మేజస్ట్రీటు

స 'చిత్తం మీరు చెప్పేదానికంటె ఆ వీధి మరో ఫర్లాంగు ఎగువన వున్నది రైల్వే గేటుకు దగ్గరగా ఉంది ఇంత బాగా జ్ఞాపకం ఉండడానికి కారణం నా చిన్నప్పుడు మా బాబయ్యగారు తరుచు రైల్వే గేటువద్దకు నన్ను తీసుకు వస్తూండేవారు

మేజస్ట్రీటుగారు ధర్మారావు మాటలను ఖండిస్తూ,

'నేను నీ యీడులో ప్రతిరోజూ ఆ వీధిలో తిరుగుతూండేవాణ్ణి నే చెప్పిన విషయాన్ని ఖండించడం నీకు అనవసరమనుకుంటాను' అన్నారు కొంచెం కటినంగా

లాయరు తల వంచుకొని నమ్రత చూపాడు

న్యాయాధికారితో తగవులాట పెట్టుకోవడం ఎందుకు అయినా అప్రస్తుతమైనట్టి విషయంమీద ఎందుకు విపరీతమైన తర్కం

ఇంతలో కోర్టులో మరో ముసలి లాయరుగారొకాయన లేచి

'మీ అనుమతితో రెండు మాటలు సార్, నేను కూడా చాలాభాగం ఆ వీధంబటే పోతూండేవాణ్ణి—ఈ వీధిని గురించి నేను చాలా పరిశోధనచేయగా—నాకు తేలిందేమంటే ఈ సంగంవారి వీధి అచ్చు ఆఖరుకు కుడివైపున ప్రారంభమై సినిమా హాలుకట్టు చివర అంతమౌతుంది.

'అక్కే సరికాదు' అన్నాడు ధర్మారావు

మేజస్ట్రీటు సదాశివరావుగారు అసలు ఈ విషయానికి కేసుకు ప్రస్తుతం ఏమీ సంబంధం లేదనీ, దాన్ని గురించి యిక తర్కించ నవసరం లేదనీ అన్నారు ఈ దొమ్మీకేసు విచారణ ఫలితం ఏమైందనే విషయం మనకు అప్రస్తుతం పోర్మనూ, ఇన్నారెవ్వరిజంటూ, అయ్యవారూ, అయ్యవారమ్మా తమ తమ గాయాలు చూపడంవల్ల సుబ్బన్నమీద కఠిన చర్య తీసుకొని తీరాలని పట్టుపట్టనూ లేదు అయినా సుబ్బన్న విషయం వారి కెందుకు

దుష్టులను చేతికి పట్టుకుని దండించడం పోలీసు వారి విధి కేసు విచారించి న్యాయాన్యాయాలు తేల్చడం కోర్టువారి విధి ఈ లావాదేవీలలో తమ కెందుకు అని యథారీతిగా వారు పక్కకు తగ్గున్నారు.

మేజస్ట్రీటుగారి బావమరిది చంద్రశేఖరంగారు ఆ క్రితంరోజే పెళ్లివ్యవహారాలు మాట్లాడుకు వెందుకు చెల్లెలుగారింటికి వచ్చాడు చంద్రశేఖరం కొడుకు రామచంద్రమూర్తి ఈ మధ్యనే బి ఏ ప్యాసు అయాడు ఇతను చూడడానికైతే బాగానే వుంటాడు కాని మనిషి కొంచెం నలుపు పొడుగ్గా, నవనవలాడే వయస్సులో ఉన్నాడు చంద్రశేఖరం తన కొడుక్కి చెల్లెలు కూతురు శారదను వివాహం చేయాలని కుతూహలపడుతున్నాడు

కాని, అసలు ఈ పెండ్లివిషయం ఇదివరకు ఒకటి రెండుసార్లు మేజస్ట్రీటుగారి ప్రత్యక్షంలో నయితేనేమి, పరోక్షంలోనయితేనేమి నలిగిన విషయమే కాని చంద్రశేఖరానికి గ్రామంలో పని తొందరవల్ల ఈవిషయం ఆలోచించేందుకు వ్యవధి కూడా లేకపోయింది పైగా ఇప్పుడు తన కొడుకు చదువు కూడా పూర్తిఅయింది గనుక, పెళ్లి గూడా అయితే ఆ బరువు తీరిపోతుందని—వివాహం స్థిరపర్చుకుని—తాంబూలాలు పుచ్చుకుని తరువాత జరుగవలసిన తతంగంకోసం ప్రయత్నం చేసుకోవాలని కుతూహల పడుతున్నాడు

ఇంతకీ రామచంద్రమూర్తి పనుకే కొంచెం నలుపైనా తీసిపారేసే అంత సులువుకాదు చిన్నప్పటినుంచీ గొప్పవాళ్ల రచనలన్నా వారి ఉపన్యాసాలన్నా, వారి గ్రంథాలన్నా అతగాడికి ఆసక్తి మెండు విశ్వవిద్యాలయంలో పట్టం పుచ్చుకున్న తరువాత ఇటీవల నవ్యసాహిత్యకారుల రచనలను చదివి బాగా అవగాహన చేసుకున్నాడేమో ఇక తానుకూడా ఒక రచయితఅయి ఒకకవియై, ఒక పత్రికాధిపతియై దేశసేవచేయాలని గాలిలో మేడలు కట్టుకుంటున్నాడు

ఆ పిల్లమీద తన మనసు కూడా పోయిందేమో ఆమెనే పెండ్లి చేసుకోవాలని అతగాడికి మనసులో నాటుకుపోయింది తనకు కాదని మ రెవరకు కట్టపెడతారు ఆ పిల్లని ?

సుమారు 8 ఘం కావచ్చింది సాధారణంగా కొంచెం ఇంచుమించు ఈ సమయానికే భోజనాలు అయే అలవాటు పెళ్లిలో ఇచ్చిపుచ్చుకోవలసిన లాంఛనాల విషయంలో భావమరదులకు తెగక ఆ రోజు భోజనాలు కూడా ఆలస్యమయినాయి పెళ్లి సంగతే వరండాలో కూర్చుని మాట్లాడుకుంటున్నారు

మే భార్య భోజనాలకు వేళయింది లేవండి యిహ తరువాత కూర్చుందాం

చంద్రశేఖరం బావగారూ—మీరు ఊఁ అనడమే తరువాయి ముందు తాంబూలాలు పుచ్చుకుంటే, మిగతా సవంతా మేము చూచుకుంటాం

మే భా లేవండీ చేసినవన్నీ చప్పగా చల్లారిపోతాయి భోజనాలయిన తరువాత

చంద్ర ఇదుగో లేస్తాం బావగారు లేస్తే నేనూ లేస్తాను

మేజ ఇందులో వాదేముందోయ్ అంతా మా చెల్లెల్ను అడుగు ఆమె యిష్టానుసారమే కాని, నా ప్రమేయం ఏమీ లేదు

చంద్ర అదేమాట నా ప్రమేయం లేదంటా వేమిటి ! యిది మరీ బాగుంది ! మీ రనేది మీరు పెద్దలు 'ఆ మాట' మీరు లాంఛనప్రాయంగానైనా అనకపోతే ఎట్లా ?

మేజ అనడాని కేముంది ఇంతకీ మా శారద ఏమంటుంది ఏమి మాట్లాడదేమి ? ఆ పుస్తకాలు అక్కడ పారేద్దూ బాబు కాస్సేపు మీ బావను

కార అబ్బ పోదురూ ఒకటే గొడవ చదువుకోనివ్వరుగదా యీ కథ చాలా ఇంట రెస్టింగ్‌గా ఉంటే సమయంలో

మే భా అమ్మాయీ, ఏమిటా విసుర్లు మీ నాన్నగారు ఏదో అంటుంటే బదులుచెప్పక ?

కార నన్నడగ నక్కర్లేదు అంటూ అక్కడ నుంచి లేచిపోతుంది

మే భా ఏమీ పలకరు ఉలకరు ఉద్దేశ మేమిటో చెప్పకూడదూ ?

మేజ నా ఉద్దేశానికేముంది ? మీ అమ్మాయి నడుగు అమ్మాయి నడగక నన్నడుగుతా వేమిటి ?

మే భా అమ్మాయినీ అడిగారు, అబ్బాయినీ అడిగారు యిహ మీరే తరవాయి

మేజ ఏమో వచ్చేఏడు చేయాలని వున్నది పెళ్లంటే మాటలేవిటి ? ఈ రోజుల్లో అబ్బో అబ్బో బోలెడుఖర్చులు కొస్తా కూస్తా నేమిటి ?

మే భా యింకా ఖర్చులేమిటండీ ? ఖర్చు లంటారు ఉభయఖర్చులు మీ భావగారే పెట్టుకుం టారట అమ్మాయికి 10 కాసుల బంగారం గొలుసులు, వజ్రాల కంఠమాల, లేడీస్ రిస్ట్‌వాచ్, పట్టు చీరలు, వెండికంచం, మరచెంబు—యిహ కావలసిం దేముంది గనక లాంఛనాలు పుచ్చుకుంటే సరి

మేజ ఈమధ్యనే—మూడు మన లాయరు ధర్మారావు పెళ్లివిషయంలో అతని బావమరది కన పడి యీ ప్రస్తావనే తెచ్చాడు

బావ అంటే మీ కోర్టులో ప్రాక్టీసు

మేజ అవును అయనే

బావ చూడండి ఆపెద్ద రావిచెట్టు వుంది—ఆ దూపాటివారి వీధిలోవున్న ఆయనేనా ?

మే భా భోజనాలకు లేవకూడదుటండీ యిహ ఆలస్యం అవుతోంది

మేజ అబ్బే అది దూపాటివారి వీధి కాదు ఎక్కడో సంగంవారి వీధిని తీసుకువచ్చి దూపాటి వారి వీధి అంటావేమిటోయ్ బలేవాడివ్

బావ కాదండీ, దూపాటివారి వీధిలో రావి చెట్టు లేదంటారేమిటి ? ఆ వీధి మొదట్లోనే ఉండి తీరాలి.

మేజ ఉండొచ్చు దూపాటివారి వీధిలో ఉన్నది పెద్దది సంగంవారి వీధిలో ఉన్నది చిన్న చెట్టు ఇంతకీ నే చెప్పిన వీధి సంగంవారి వీధి

బావ ఏమో మరి ఇంతకీ సంగంవారి వీధి ఎక్కడుందంటారు ?

మే ఇప్పుడు పాతసినిమా థియేటర్ వున్నదే దాని ప్రక్కగుండా వెళ్లే సందు రైల్వేగేటుకు దగ్గరగా ఉన్నది

బావ : అదికాదండీ మామగారూ, అచ్చాఫీసు వుంది—దాని ప్రక్క వీధే సంగంవారి వీధి ఈ మాత్రం నాకు తెలియదూ ?

మే భా రామాయణంలో పిడకలవేట. సంగం వారి వీధి ఎక్కడుంటే ఏం ? మంగలివారి వీధి ఎక్కడుంటే యేం ?

మేజ ఆఁ నేను పాతసినిమాథియేటరు ప్రక్కగుండా వెళ్లే సందే సంగంవారి వీధి అంటున్నా మీ అన్నగారు అది కాదంటున్నారు

మే భా మా అన్నయ్య చెప్పిందే రైటు అచ్చాఫీసు ప్రక్క వీధే అది మా ముత్తవతల్లి చెపుతుంటే విన్నాను

మేజ అవిషయం తెలుసు అయినా తెలిసీ తెలియని వాదన లెందుకు నీకు ?

మే భా బాగుందండి మీ రవేది ఇక మీ కొక్కరికే గాబోలు ఊరుసంగతి తెలిసినది

మేజ నా చిన్నతనమంతా, చదువుసైతం యీ వూళ్లో పూర్తిఅయింది ఏమిటో నాకు తెలియనట్లు, మీకు మహా తెలిసినట్లు మాట్లాడతా రేమిటి ?

మే భా ఆయన మాటలకేంగాని—

మేజ నీవు మహా చెప్పొచ్చావులెద్దూ లోపలికి పో అయినా ఊళ్ళోకి వెలతోవారి, ఏడాదికోసారి వస్తూ—వూరు సంగతి ఏం తెలుసు మీకు. ఎక్కడో సంగంవారి వీధిని తీసుకువెళ్ళి దూపాటి వారి వీధి అంటే ఎవరైనా నమ్మాలా అక్కర్లేదా ?

బావ మా తండ్రిగారి హయాంలో ఏదో పుస్తకాలు అచ్చువేసే సందర్భంలో అచ్చాఫీసుకు పంపేవారు. అచ్చుఆఫీసుకు ప్రక్కనుంచే సంగంవారి వీధి తెలుస్తుంటేది. నాకు బాగా గుర్తు లేదంటారేమిటండీ.

శారద: ఏమిటండీ—యీ గొడవ నన్ను ప్రశ్నలం పూర్తికాయ్యనియ్యరా ఏమిటి?

మేజ అమ్మాయ్—నీవు చెప్పు సంగంవారి వీధి ఎక్కడుంద్తో!

శారద ఓహ్ దీన్ని గురించా సంగంవారి వీధి పాతసినిమా థియేటరు ఉందే దాని ప్రక్కగుండా వెళ్ళే సందే సంగంవారి వీధి

మేజ బాగా కరెక్టుగా చెప్పావ్ అది కాదంటాడు వీరా మామయ్య

శారద ఆ వూళ్లో ధాన్యమేమిటో, పంట ఏమిటో అంతేకాని, మామయ్యకు ఏమీ తెలియదండీ నాన్నా మా కాన్వెంటు స్కూలుకు వెళుతుంటే ప్రతిరోజూ మా బండి ఆ వీధి ప్రక్కనుంచే వెళుతుంది సుబ్బన్నగారి అమ్మాయి ఆ వీధిలోనుంచే వస్తుండేది

మే. భా నీకు మహా తెలుసు పసిపిల్లవు నీ వూరుకుందూ

శారద బాగుందే అమ్మా ఏం నాకు మాత్రం తెలియదూ

మేజ దాన్ని గూరుకోమంటూ వేమిటే ఏం దానికిమాత్రం తెలియద్దా?

బావ బావగారూ, మీరు బాగా ఆలోచించండి సంగంవారి వీధినే అసలు అష్టవంకర్ల వీధి అంటారు. కోణంగిపేటలోంచి అచ్చుతోటసువద్ద కలిసే వీధే సంగంవారి వీధి

మేజ ఆలోచించే దేమిటండీ ఆలోచనా పాలోచనాను మీరన్నది తప్పండీ సినిమా థియేటరుకు ప్రక్కగుండా వెళ్లే సందే సంగంవారి వీధి ఇంత విపదీని చెప్పినా మీరు కాదంటే ఏమి చేయాలి

బావ యిహ మీతోటి వాదించి ఏం ప్రయోజనం

మేజ అయితే నే చెప్పింది కాదంటారా?

బావ నే చెప్పిందిమాత్రం తప్ప నెక్కడుంది.

మే భా మన కెందుకు వచ్చిన గొడవ ఇది. సంగంవారి వీధి ఎక్కడుంటే ఎవరి క్కావాలి ముందు అమ్మాయి పెళ్లిసంగతి ఆలోచించండి

మే. అయితే నీతాకే తేమిటి?

మే. భా తాంబూలాలు పుచ్చుకోమని

మేజ పుచ్చుకోవచ్చులే యిప్పుడు వచ్చిన తొందర ఏమీ లేదు

మే భా మీ యిష్టం బాబూ ప్రాణం విసిగి పోతూంది మీతోటి ఇప్పుడు గాకపోతే మరి కెప్పుడో అయినా అమ్మాయిని యివ్వకపోతే వాడికి పెళ్లి జరగదా వాడు దీన్ని పెళ్లి చేసుకోకపోతే దీనికి పెళ్ళవదా?

బావ అమ్మాయి నీ వూరుకో అయితే బావగారు తాంబూలాలు పుచ్చుకోవడం దాకా వచ్చి మళ్లీ ఇట్లా మాట్లాడుతున్నారే

మేజ దాని పెళ్లి కిప్పుడేం తొందర లేదండీ తరువాత మాదుకోవచ్చు

మే భా పెళ్ళి లేదు—ఏమీ లేదు కూర్చోపెట్టండి యింకా ఎన్ని రోజులు పెళ్ళి చేయకుండా కూర్చోపెట్టాలనుంకా

బావ నే వస్తానే అమ్మాయి ఇప్పుడు బండి వుంది రాత్రి రైలుకి పోతున్నా

మే భా అదేమో భోజనంఅయినా కాలేదు భోంచేసి వెళ్లు నా మాట విను

చంద్ర భోజనానికేం లేవే భోంచేస్తే రైలు దాటిపోతుంది నే వెళ్లొస్తా అంటూ వచ్చినదారినే వెళ్ళిపోయాడు చంద్రశేఖరం

## 4

మరికొన్ని రోజులకు తరువు మేజస్ట్రేటుగారింటికి వచ్చే సూరిశాస్త్రిగారు ఆ రోజు మధ్యాహ్నం ఏదో పనుండి వచ్చారు. వరండాలో కూర్చొని తాంబూలం వేసుకోపాగారు పోకలు నములుత్తూ శాస్త్రిలవారు

'నా మనస్సుకు ఈ విషయం పట్టినట్లు మరేదీ పట్టలేదు నాకు అర్థమయినట్లు మరెవరికీగూడా అర్థమవనే అయియుండదు' ధర్మారావును ఉద్దేశిస్తూ గాలోలు—'అయినా ఆ వృత్తిలో సతతమూ తిరిగే వాళ్ళకూ, ఆ ధారాశుద్ధి, ఆ వాక్శుద్ధి వుండదూమరి చెడ్డఅలవాటు ఏమంటే కావలసిన పాత్ర్యమూ, పరిశోధనా రుజావూ లేకుండా వితండవాదం చేసినందువల్ల ప్రయోజనం ఏముంటుంది దీనగవది దీన్నిగురించి వినక కొన్ని ప్రాణాలు పోయాయి'

శాస్త్రిలవారు మరో రెండు తమలపాకులు తీసుకుని నములుతూ—

'యింతకీ సంగంవారి వీధినిగురించి జ్ఞాపకం ఉన్నదా?'

మేజ లేకం

మరి అదెక్కడ వుంటుంటారు?

మేజిస్ట్రేటుగారు పెన్సిలు తీసుకుని టేబిలు అట్టమీద వివరంగా గీచి చూపుతూ, 'అక్కడనుంచి మొదలు ఇంతవరకూ ఉన్నదే సంగంవారి వీధి'

శాస్త్రిలవారు బాగా పరికించి తదేక దీక్షతో ఆ మ్యాపును చూచి గొంతు సవరించుకుని,

'వీరు శ్రమపడి మ్యాపు గీయడమైతే గీశారు గాని—అసలు ఈ వీధి ఎక్కడుందన్న విషయంలో మీ అభిప్రాయం కూడా తప్పే—ఆ రోజు లాయరు గర్వారావు చెప్పింది తూచాగా సరిపోయింది' అన్నారు కొద్దిగా నవ్వుతూ

'ఓహో అల్లాగ'—అంటూ అంతవరకూ ఖులాసాగా సంతోషంతో కబుర్లుచెప్పిన మెజిస్ట్రేటు సదాశివరావుగారు ఛీదరించుకుంటూ ధ్రుమని కుర్చీలోంచి గభాలున అక్కడనుంచి లేచ్చక్కా పోయారు

'ఇదేమిరా బాబు—ఎన్నడూ లేనిది నేను ఈయనకు కోపం తెప్పించామే' అనుకుంటూ మెల్లిగా ఇంటికి బారాడు శాస్త్రిలవారు

కోపం శాంతించిం తరువాత మేజిస్ట్రేటుగారు వాకబుచేయగా తేలినవిషయ మేమంటే ఈ సంగం వారి వీధిలో సంగం బాపన్న అనే అతను ఉండే వాడనీ, పిమ్మట అతను చనిపోగా అతని కొడుకు సంగం వెలమయ్య క్రిస్టియనమతం పుచ్చుకుని తనకు అక్కడ ఉన్న స్థలం, ఆపాటికొంపలు అన్నీ పురపాలక సంఘంవారికి అమ్మేసి యింకో వూరు లేచిపోయాడనీ, యిప్పుడు ఆ స్థలంలో పురపాలక సంఘంవారు ఎలిమెంటరీ పాఠశాలను యిటీవలనే నిర్మించారనీ, కాగా యిప్పటి పురపాలకసంఘ ప్లానులో అసలు సంగంవారి వీధి లేనేలేదనీ తేలింది



# రాయలవారి ఋతువర్ణనలు



శ్రీ దివాకర్ల వేంకటావధాని

ప్రబంధములు వర్ణన ప్రధానములైన కావ్యములు. పెద్దనార్యుని నాటినుండియు ప్రబంధ కవులేదో యొక యవకాశము కల్పించుకొని తమ కావ్యములలో నష్టాదశవర్ణనములను గావించుచునే యున్నారు. ఈ పదునెనిమిది వర్ణనలయభావము ప్రబంధమున నొక లోపముగా భావింపబడుటచే కొందఱు కవులు ప్రసక్తి లేకపోయినను నియమానుసరణమునకై యనావశ్యకములైన వర్ణనలు కావించుటయు గలదు. వర్ణ్యవిషయములైన యీ యష్టాదశ విషయములలో ఋతువులు కూడ చేరి యున్నవి. అందుచే ప్రబంధకవులు కథా సందర్భమునుబట్టి యేవో కొన్ని ఋతువులనైన వర్ణింపకుండరు. శ్రీ కృష్ణదేవ రాయలవారు తమ యాముక్తమాల్యదలో నాలుగు ఋతువులను గూలంకషముగా సూక్ష్మాతిసూక్ష్మ వివరములతో వర్ణించియున్నారు. ఆ వర్ణనలలో నాయన యనన్యసాధారణమైన ప్రతిభాచాతుర్యములను ప్రదర్శించి యుండుట యాముక్తమాల్యద పఠించిన వారెల్లరకును విదితమే. ఆ ప్రతిభాచాతుర్యముల నీ వ్యాసమున యథాశక్తిగా నిరూపింప యత్నించెదను.

గోదా శ్రీరంగేశ్వరుల ప్రణయమే యాముక్తమాల్యదయందలి ప్రధానవృత్తము. అది యందలి చివరి రెండాశ్వాసములలో చక్కగా వర్ణింపబడి యున్నది. మొదటి నాలుగాశ్వాసములలో నీకథతో నంతగా సంబంధము లేకపోయినను వైష్ణవమతాభిమాను లగుటచే రాయలవారు విష్ణుపారమ్యమును సూచించు విష్ణుచిత్తయామునాచార్యుల వృత్తాంతములను విశదీకరించి యున్నారు. విష్ణుచిత్తుడితర మతస్థుల నోడించి పాండ్యరాజునకు వైష్ణవమత సారము నుపన్యసించు సందర్భమున ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానమును, యామునాచార్యుడు శ్రీరామమిశ్రునిచే నుద్బోధితుడై కుమారునికి రాజ్య మొప్పగించు సందర్భమున దీర్ఘమైన రాజనీతి వర్ణనమును గలవు. చివరి యాశ్వాసమున మాలదాసరి వృత్తాంతముపకథగా నున్నది. ఈ యుపకథోపాఖ్యాన రాజనీతి వర్ణనలకు తోడు మన్యమున్న గ్రీష్మవర్ష శరద్వసంతముల విపులవర్ణనము లున్నవి. ఇవన్నియు గలిసి యాముక్తమాల్యద యందలి ప్రధానకథను మఱుగు పుచ్చి దాని నొక చిన్న విష్ణుపురాణముగా నొనర్చి వైచినవి. వస్త్వైక్యమునకు భంగము చేకూర్చు నప్రసక్త విషయ విస్తరణ మాముక్తమాల్యద పఠించు వారి కించుక కింద కలిగించినను అందలి ప్రకృతి పరిశీలన భావ గాంభీర్యాదుల హృద్యమైన యానందమును చేకూర్పక మానవు.

ఆంధ్రవాఙ్మయమున కొల్లింటికవులు తమ తమ కావ్యములలో వసంతాది ఋతువులను వర్ణించి యుండకపోలేదు. కాని యావర్ణనలెవ్వియు రాయల వారివర్ణనములంత దీర్ఘములుగా గాని కూలంకషములుగా గాని కానరావు. ఆంధ్రవాఙ్మయమునందే కాదు సంస్కృత వాఙ్మయమునగూడ ఋతువర్ణనైక వస్తుకములగు ఋతుసంహారాదుల నొక్క నితరకావ్యములలో నింత దీర్ఘములగునట్టి ఋతు వర్ణనలు కానబడవు. ఇటీవల కవిసమ్రాడ్బిరుదాంచితులైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తెలుగు ఋతువులను పేర నొక ఋతువర్ణన ప్రధానమైన కావ్యమును ప్రకటించియుండిరి. అందలి వర్ణనములు నైతము భావగంభీరములై కవిగారి ప్రకృతి పరిశీలన నైశిత్యము ననేక విధముల వెల్లడించుచున్నవి. చిన్నదయ్యు మనోహరమైన యీ కావ్యమునే యొకవిధముగా రాయలవారి ఋతువర్ణనలకు సాటిగా పోటిగా చేర్కొనవచ్చును. మిగిలినవానిలో ఋతువుల వర్ణనములున్నను ఇన్ని ఋతువుల వర్ణనము లేదు, ఉన్న ఋతువుల వర్ణనమైనను ఇంత సమగ్రమైనది కాదు.

స్థూలముగా పరిశీలించినచో నాముక్తమాల్యదలో ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యాన రాజనీతి వర్ణనాదులవలెనే యతిదీర్ఘములైన యీ ఋతువర్ణనములును గథాగమనమున కడ్డగించి కావ్యమునందలి వస్త్వైక్యమునకు భంగము కలిగించియుండుట యథా

ర్థమే యనిపించును కాని నూత్నముగా వారి చెప్పుడు వానికి గథాంశములతో గల కల్పించిన సంబంధము స్పష్టము కాకపోదు ద్వితీయాశ్వాసము నందలి కథకు వేశ్యాగృహమున కరుగుపాండ్యరాజు పరదేశివిప్రుడు పఠించిన సుభాషితశ్లోకము నాలించి, హఠాత్తుగా విరక్తుడై సౌధమునకు మరలివచ్చి మాత్రముడైన దేవు డెవ్వడో నిర్ణయింపుమని పండితుల గోరిన ఘట్టము కేంద్రభూతమైనది సుభాషితము చదివిన విప్రుడెచ్చటి కప్పుడు వచ్చుటకు "దన్నికట వృషగిరి హరికి విభవము విప్పగా" జరుగు తెప్పతిరునాళ్లజాము కారకయే కారణము అళఘురియందుండు సుందరబాహుస్వామికి దెప్ప తిరునాళ్లు వేసవిలో జరుగును ఆ యుత్సవములు గన్నులార భక్తితన్మయుడై చూచి పోవుచు బరదేశి బ్రాహ్మణుడు మధురానగర దిదృక్షు ప్రవేశప నచ్చటి కరిగి, రాజపురోహితునింట గ్రీష్మకాలోచితమైన మృష్టభోజనము కావించి, తోడి విప్రులతో మార్గవేదికపై బరుండి యుబుసుపోకకై వారిలో నొక్కడార్యలును వేఱొక్కడు గీతలను బఠింప దాను సుభాషితము జదివెను అతడు మార్గవేదిపై బరుండుటకు హేతువు "పెనవేసవి" అతడచ్చటికి వచ్చుటకు హేతువా వేసవిలో వృషగిరి హరికి జరుగు తెప్పతిరునాళ్లు వేసవిలో దప్ప మఱొకప్పుడా యుత్సవము జరుగను జరుగదు, పరదేశి బ్రాహ్మణు డచ్చటికి రాను రాడు వచ్చినను మార్గవేదిపై బరుండెడు మార్గవేదిపై గాక యే గృహాంతర్భాగమునన్ శయనించి యాతడు సుభాషితముల జదివినను వీథిలో బోవువారి కవి వినబడవు పాండ్యుడా సుభాషితమును వినకుండినచో గథాసంవిధాన మీతీరున సాగియే యుండదు ఇన్నిటికిని హేతువగుట చేతనే రాయ లిచ్చట నా వేసవిని వర్ణింపబూనినాడు

చతుర్థాశ్వాసమున వర్షశరదృతువులు వర్ణింపబడినవి ఈ వర్ణనలు యామునాచార్యుడు తనతో వాదము చేయవచ్చినవారి నెల్లర నోడించి విష్ణుదేవుడే పరతత్త్వమనియు విశిష్టాద్వైతమే మతమనియు బ్రతిష్ఠించిన పిమ్మట జేయబడినవి పాండ్యరాజు యామునాచార్యుని మాహాత్మ్యమునకు సంతోషించి, సాష్టాంగ మెఱగి, యాతనికి దన కడగొట్టు చెలియలి నిచ్చి పెండ్లిచేసి, "యరణంబుగ నమ్మహాత్మునకు ధారాపూర్వకముగా నర్ధరాజ్య మిచ్చి" యువరాజుగా నొనరించెను పిమ్మట నాతని కధర్వశిరస్సభృత్ప్రస్త మకుటము నందు దివ్యాస్త్రమంత్రంబు లుండుటయు తెలిసి దుస్సాధంబగు విరోధి యానంబు సాధింపుమని దండయాత్రకు బంప యామునాచార్యు డందుకు సన్నద్ధు డగుచుండెను అప్పటికి సరిగా గ్రీష్మము ముగిసి వర్షాగమ మారంభము కానుండెను పురోహిత ప్రధానమంత్రి వర్గంబు యామునాచార్యు దిగ్విజయ యాత్రా సన్నాహ మెఱింగి "సన్నిహితంబులగు నివ్వార్షిక దినంబులు గడపి శరత్సమయంబున విద్విషత్సంహారంబునకు విజయము సేయు"మని బోధించిరి యువరాజు వారి మాటలు పాటించి, దౌత్తైఱంగు రాజాన కాలెంగించి తత్సమృతి నప్పటికి నిలిచెను

ఋతువు లాటింటిలో శరదృతువు వీరరస ప్రధానమగు దిగ్విజయయాత్ర కనువైనట్టిది సాధారణముగా బూర్వపురాజులు దండయాత్ర వెడలుట యా ఋతువునందే ఈ యాచారమును బురస్కరించుకొనియే సంస్కృతాంధ్రకవులు పలువురు దిగ్విజయయాత్రలను వర్ణించుటకుముందు శరత్తును వర్ణించి యుండిరి కాళిదాసు రఘువంశమున రఘుమహారాజు దిగ్విజయ యాత్రకుముందు శరదృతువును వర్ణించి యుండుట యెల్ల రెఱింగినట్టిదే సంస్కృత నాటకముల ప్రస్తావనలలో వీరరసము ప్రధానరసమైనప్పుడు శరదృతువు వర్ణింపబడవలెనని లాక్షణికుల నియమము కావించుట యారసమునకును ఋతువునకును గల యవినాభావసంబంధమును బురస్కరించుకొనియే యైయుండును ఈ సంప్రదాయము ననుసరించియే రాయ లిచ్చట యామునాచార్యుని దిగ్విజయమునకు నాందిగా శరదృతువును వర్ణింప దలచినాడు

ఈ శరదృతువర్ణనమునకుముందు మిక్కిలి దీర్ఘమైన వర్షర్తు వర్ణనము కలదు దీని కిచ్చట నంతగా బ్రసక్తి లేదు కాని పాండ్యరాజు తన చెల్లెలిని యామునాచార్యున కొసంగి, యాతని యువరాజుగా నొనరించి, దిగ్విజయయాత్రకు బ్రోత్సహించినది గ్రీష్మర్త్వంతమునందు వార్షికదినంబు లప్పటి కతి సన్నిహితములై యుండెను. వర్షర్తువు గడచిన

నిమ్మటగాని యామునుడు చైత్రయాత్రకు బయలుదేఱరాదని వృద్ధపురోహితాదుల యభిప్రాయము ఈ వర్షకాలము రాకపోకలను సూచించు తలంపుతో రాయలు శరదృతువును బూర్వము దానిని వర్ణించి యుండెను ఆయన కితర ఋతువులయందు గంటె వర్షర్తువునం దభిమాన మెక్కువ ఆకాన యీ యభిమానము వర్షర్తువర్ణనమునం దెల్లెడ స్పష్టముగా గోచరించును ఈ వర్షర్తువురాక నాయక యంతికమునందే "గ్రీష్మసమయ విరశ్వాహకేకిరమణి, నవఘనధ్వని కలరు చందమున వలరి" పాండ్యరాజ భార్య యాతనిలో యామునాచార్యునుదంతము తెలెంగించెనను సందర్భమున నతి రమణీయముగా సూచించియున్నాఁడు ఈ సూచనయు దగువాత సాగిన వర్ణనయు మిక్కిలి మనోహరములుగా నున్నను ఇంత దీర్ఘముగా నా ఋతువు నిచ్చట వర్ణించుట కొంత యప్రసక్తముగా నేయున్నదని చెప్పవలయును

పంచమాశ్వాసమునందలి కథ కలంకారమైనది గోదా విరహఘట్టము ఈ విరహ మాంధ్రవాఙ్మయమున కపూర్వమైనది హార్దమైన యనురాగము నింత లెస్సగా సూచించు విరహమును వర్ణించిన కవి యాంధ్రవాఙ్మయమున నింకొక్కఁడు లేడు విరహమున కుద్దీపనమైనది వసంతము అందుచేతనే రాయ లిచ్చట నీ వసంతర్తువును సమగ్రముగా వర్ణింప బూనినాఁడు

మొదలఁ జాముక్తమాల్యద మదనతాప
తరణి పెనువెట్టఁ జేగిన దక్షిణాశ
మత్కృపతోమ్మకు దుదముట్ట మాసునను దు
దొలఁగ వన నుత్తరాశకు దొలఁగ దరణి

గోదాదేవి ధనుర్మాసమున విష్ణుసేవావ్రతమును బూని ముప్పదిదినములు ముప్పదిపాటలుగా దిరుప్పావై పాడెనని ప్రతీతి దీనికనుగుణముగా రాయలు పై పద్యమున మార్గశిరు దక్షిణాశ వీడి యప్పు డుత్తరాశకు దొలగెనని వర్ణించియున్నాఁడు

ఈ విధముగా నీ ఋతుచతుష్టయవర్ణనము మిక్కిలి దీర్ఘమైనను గథ కేదో విధముగా నించుక సంబంధించియే యున్నదని తెలియవచ్చుచున్న ఈ ఋతువర్ణనమునుబట్టియే కాక రాయలు కావించిన రాజనీత్యాదులవర్ణనములను బట్టి కూడ జూచినచో కాక జరితవర్ణనాభిలాషయని పాడగట్టును ఏదైన విషయములను వర్ణింపదలచినప్పుడు దానిని సర్వాంగసుందరముగను సమగ్రముగను వర్ణించినగాని యాతనికి దృప్తికలుగదు అచలాకాలముతీరే యట్టిది కాబోలును. కార్యనిర్వహణమునగాని భోగానుభవమునగాని సమగ్రతయే యప్పటివారి లక్ష్యముగా నుండెను కార్యమును సామిసామిగా జేసి యూరకుండుటకాని, భోగవిలాసముల నించించుక యనుభవించి విరమించుటకాని వా రెఱుగని పద్ధతులు ఆ చిత్తవృత్తియే యీవర్ణనలందును గోచరించుచున్నది ఈ నాలుగువర్ణనములును మాస్త్యతిమాత్ర వివరములతో గూడి సర్వ సమగ్రములుగా నున్నవి. ఈ సామగ్ర్యమే వాని కవితాకావ్యసాధారణమైన గాంభీర్యమును దెచ్చిపెట్టినది

కాలమెప్పుడు నొక్కమాదిరిగా నుండదు అది ప్రతిక్షణమును బరివర్తన మొందుచుండును ఆ పరివర్తనప్రకారము దినములు గడచినప్పుడు కాక ఋతువులు మాఱినప్పుడు మిక్కిలి స్పష్టముగా గానపించును ఒక్కొక్క ఋతువున కొక్కొక్క వాతావరణ ముండును పంచభూతాత్మకమైన ప్రకృతిలో గలుగు మార్పు యీ వాతావరణమునందలి మార్పునకును గారణమైయుండును ఈ మార్పు మానవులందరికిని గోచరించినను గవులదృష్టికి మఱెంత స్పష్టముగా విశదముగా గోచరించును దానిని వారు నిపుణముగా బరిశీలించి యక్షరరూపమైన యాకారమునతో నచ్చుకొట్టుదురు అట్టి ఋతువులకు సంబంధించిన భిన్నభిన్న వాతావరణముల సుందరముగా జిత్రించి వానిని బఠితలముందు సాక్షాత్కరింప జేయుటలో రాయలు కడుంగడు నేర్పరి ఆముక్తమాల్యదలో నాతడు గ్రీష్మవర్ష శరద్వసంతములకు సంబంధించిన వాతావరణ పరిస్థితులను ప్రకృతి సౌందర్యవిశేషమును జిత్రమునందట్లు మిక్కిలి స్పష్టముగా వర్ణించినాడు అతడు వర్ణించిన మరుమరీచికలు, కాల్మరీభలను రెండకు బసులగా గాలిలో నెగిరియాడు తూలకశములు, బొండుమల్లియలు, ప్రపలు, సుడిగాలులు గ్రీష్మమువారిని మన కట్టెదుట సాక్షాత్కరింపజేయుచున్నవి వర్షకాలము రాగానే యీ పరిస్థితులన్నియు మాఱిపోయినవి. అప్పు డాకసమున నెచ్చట జూచినను బంచలా

సహితములైన ఘనాఘనములు, ఇంద్రగోపములు, ఇంద్రకార్ముకపు బలు వన్నెకట్ల కెత్తిదెవ నవకెంపు కాళ్ళగుంపునగా" నడచు వానకోళ్ళు కానబడును తొలివానజల్లుతో గరకానికాయములు పడపా సను భూమిపై నెల్లయెడల ఛత్రాకపంక్తు లుప్పతిల్లును చెఱువులలో నేకాక చిన్నచిన్న పడియలలో గూడ వృత్తభేదానుకృతితో భేకస్వరు లెవలారును కోకిలల పంచమ స్వరములకు బదులు కేకుల షడ్జస్వరములు వినిపించును మరియు సప్తతాలాలోకముల కుకలహూంకృతి మాలుగా గదంబకుటజ నీపకకుభయూధికలను క్రొత్తపాయకములతో దన కూతీరమును నింపుకొనును "ఆమనివేళ బద్ధ చాంపేయకముల నమ్మి కడపళ్ళ దమ్మునైచినవాడు ము". నానపసువారిని జూచి నవ్వినట్లు కేతకి గహనతతులు వికసించును ఈ పరిస్థితులన్నియు వర్షాదేవత వింతమూర్తిని మన కనులయెదుట నిల్పుననుటలో నాశ్చర్యమేమి? శరత్తు రాగానే మరల నీ దృశ్యమంతియు నదృశ్యమగును అప్పుడు తెల్లని మేఘములు, కాశస్తంభములు, శాలిమంజరులు, గజముల తిర్యగ్దంత ప్రహారములు, మరల మాలికల యొయ్యారపు నడకలు కనులకు బందువు చేకూర్చును హేమంత శిశిరర్తువులలో మరల నీ దృశ్యములు, వస్తువులు మృగ్యములైపోవును వసంతము రాకతో మలయమారుతప్రసారములు, చిగురాకుల సోయగములు, క్రొన్ననల పరిమళములు, అళిఝంకారములు కోయిలల పంచమస్వరములు ప్రకృతికొక వింత రామణీయకము నాపాదించును సహకార వృక్షములు పుష్పించి పుష్పబాణున కక్షయతూణీరత్వము కలిగించును ఇట్లీ ఋతువుల యాకృతిలోగల వైలక్షణ్యమును సుస్పష్టరేఖలతో దీర్చిదిద్దుటకు నిశితమైన ప్రకృతిపరిశీలనము కావలయును అది రాయలవారి యందు సర్వతోముఖముగా గోచరించును అందుచేతనే యాయన ఋతువర్ణనముల బఠించునపుడు భావగతమైన యానందము కలుగుటయేకాక యాకాలసంబంధితములైన యాయా ఋతువు లనుభవమునకు వచ్చుట కూడ బొడగట్టును

ఆయా కాలములందలి ప్రకృతిపరిస్థితులు మాత్రమే సూక్ష్మ వివరములతో బ్రత్యక్షమగుట రాయల వర్ణనములందలి యొక ప్రత్యేకలక్షణము. సాధారణముగా మనము చూడని, చూచినను అంతగా బరిగణింపని విషయముల నెన్నింటినో యాయన చక్కగా వర్ణించి యున్నాటి వర్ణన కెంతో సహజత్వము చేకూర్చును చరాచరప్రపంచమంతయు నాయన దృష్టియెదుట సుస్పష్టరేఖలతో వచ్చి నిలుచును వస్తువుల సూక్ష్మాధిక్యములతో నాయనకు బనిలేదు బోటకులను బొమ్మిడాయి దాతూక్కటకులంబుల భక్షించుటయు భూపాలురంతఃపురముల భోగముల ననుభవించుటయు నాయన సమాదరముతో నే వర్ణించును వేసవిలో జక్రాల ప్రాచి పెన్నీట తెగయుటయు, దమరప ద్రవ్యంబు పంకేజ కొంగ్యభానుప్రవతులు హరింప ద్రబ్బాకదేవునితో మొఱ నెట్టుకొనుటకై పోవుమన్న మూనోర్యవహపరితానమూ యను భ్రాంతి గొల్ప సుడిగాలులు విసరుటయు, గ్రాష్మమున నానక జనని వృక్షముల క్రింది కేగ జనుల జల్లు తలపడిక మున్నే తిరులు వంపుళ్ళ దమపుటయు, శరత్తున నర్కమండలి కల్భ మస్తమైనంత నే లేక తెలిమాని మాము బికెట్టు మాచుటయు, వసంతియున విసరువోతులు మృగమదాలేపములను ఆగరుకలనలనుమాని దన్నగవ మీదికి వన్నిసరము లొప్పుటయు మున్నగాగల విషయము లేవియు నాయన దృక్పథమును దాటి పోలేదు వేసవిలో జామదఘ్న్యమునైన చెఱువులందు నిర్చి బకపంక్తులుం దలను, జలుకిసల్లలను నములుచు నెండ్రికాలి కితకిత నొగసి, యొక్కొంచుక తొలగి శక్రోటీ దూటితినుట నాయన చూచుచున్నట్లు వర్ణించును వర్షమున బక్షులు జడత్వముచే దుదరెప్పల గన్ను విప్పి, నీరుముంగరలవలె ముక్కున గూడ, నోట గొంతొడియుచు గూటికట్ట పగ మెత్తుచు జానువులు వక్షము చేర ముక్కు విదిర్చు మున్నుగా వనికుటయే తప్ప మిగిలిన చేష్టలన్నియు మానుకొనుటయు, భూమండలమును శ్రీపరివేషము చుట్టుటయు నాయన పతితలకు సాక్షాత్కరింప చేయును శరత్తున "ప్రథగ్న్యకాల్యవని తాలాభము" గలుగుట నాయన యూహించును వసంతమున గామినులు భోగానంతరము ఘర్మకణంక చే దోమతెర లుప్పర వెత్తుటయునాస్తములు దెప్పరమగుటచే లోపల కళత్రప్రకటీకరణంబు తెప్పూటయు నాయన కనుభవసిద్ధములైన కృత్యవిశేషములు కాబోలును. ఋతువుల నన్నింటి నాయన చక్కగానే వర్ణించినను వర్ష

కాలవర్ణనమున మఱింతచాకచక్యమును బ్రకటించెను. అప్పుడు వంటవండు విల్లాంౘ్రు పసుశ్లేశమును వర్ణించు నీ పద్యమాయన సూక్ష్మపరిశీలనకు బరమావధి

ఇల్లిల్లు దిరుగ జొక్కింతబ్బు శిఖి, యచ్చె
 చే వింటిలో బారియుండి విసరక
రాజదు, రాజిన రవులుకొల్పు వసరె
 కాని కల్గదు కూడు, దాన గలిగ
సేని కూరగుటముం, దైన చెజ్జొగసుఖ
 భుక్తి సేకూరదా భుక్తి కిడిన,
బ్రాగ్భోక్తలవి తీరు బహుండనాన్నము దీర
 వారలకొదవు బునః ప్రయత్న

మాజ్యపటముఖ్యులయి మెన్నరు ఈపద్యమును జదువునప్పుడు సామాన్యజనసహజమైన యాశ్లేశము వాయన యెప్పుడు చూచెనాయని యాశ్చర్యమును, ఆయన సూక్ష్మతిసూక్ష్మ పరిశీలన కానందమును గలుగక మానదు.

సాధారణముగా కవులందఱును వర్ణనసందర్భములందు గవిసమయముల మాతగా గొని వింత వింతి భావముల వ్యక్తము చేయుచుందురు ఈ కవిసమయములు యథార్థములగువా కాదాయనునది వేఱు మాట కాని యవి సర్వకవిసంప్రయుక్తము లగుటచే మనకు వింతగా నుండకపోవుటయేకాక వర్ణ్యవిషయమును మఱింత స్పష్టము కావించును ఋతువులన్నిటికి సంబంధించిన కవిసమయము లిట్టి విన్నో కలవు రాయలందొక్కదానిని గూడ విడువకుండ వర్ణించుటలో గృతకృత్యుడు ఈయన వర్ణనలలో నీ సమయపరిజ్ఞానము సర్వతోముఖముగా గోచరించును. ఒక్కొక్క సమయమును బురస్కరించుకొని యాయన యొక్కొక్క రమ్యమైన భావమును సృష్టించుచుండును గ్రీష్మమున దివసములు దీర్ఘము లగుట కవిసమయమునందే కాక శాస్త్రమునందు గూడ సిద్ధమైన విషయము అప్పుడు వెట్టిదంప్రు పెట్టచే హస్తము చెమర్చిలప్తకము దుసీశిలం జేయుటచే సవరింప వశముకాక మదనుడు చెఱకువి ల్బదమి బడ నచెనట అది చెఱకుపండెడుకాలమగుట యీ భావము పుట్టుకకు హేతువయ్యెను చాతకములు మాగి యొక చినుకైన సర్విక్ దిగ్గసీపండుట, ఘనుడు సకలమును నిద్రబుచ్చు కేశవుని నిద్రపుచ్చుట కారణ లింటను వివి యలకరై దివి జెఱబట్టుట వర్షకాలమునకు సంబంధించిన సమయములు. తినయులు చొచ్చిన యింద్లనే యుండి కొన్నువకు బుట్టినిల్సేరుట రాయలవారే కాక యిప్పటికిని మాఱని సంప్రదాయము దీనిని బురస్కరించుకొని యాతడు వనధిగమన ఘుచే సగర్భములైన యర్కకిరణములు ప్రసూతికై మరల వాతని ధామము చేరెనని చక్కగా వర్ణించెను "ద్విజతి వారణ్యక ధ్వని వినగ జేసి గర్భము సుఖద్యుతము చేయ గడంగుటయు నిట్టి సంప్రదాయమే వర్షకాలమున బ్రయ్యి రాజమిచే బోనము ప్రజకు జక్కులబోనముగుట యెవ్వ రెఱుంగని విషయము? ఈ సమయ సంప్రదాయముల నెఱుంగుట యొకటి, వాని నూతగా జేసికొని దివ్యములైన భావముల సృజించుట వేఱొకటి రాయ లిట్టివానిని బ్రత్యేకాభిమానముతో వర్ణించువా యనిపించును శరదృతువు రాగనే రాజమరాళములు క్రౌంచగిరి రంధ్రముద్వారా దశార్ణదేశములకు దిరిగివచ్చుచు ప్రజలు శరద్వాజపేయము లొనరింప గడగుదురు విష్ణువు నిద్రనుండి మేల్కాంచును కలశిమానుదుదయించి కలుషితాంభస్సులకు బ్రసన్నత చేకూర్చును ఈ సమయములు గంభీరములైన భావములకు బ్రభవములై రాయలవర్ణనములకు మహత్తరమైన యౌదార్యము చేకూర్చును సంతతికి దంతములు చూపట్టగనే వనితలు పురుషసాంగత్యము నభిలషింతురను సంప్రదాయమును వనలక్ష్మి మాధవులయం దారోపించి రాయలు మనోహరమైన భావమును వెలిబుచ్చెను ఇంక వసంతకాలము రాగానే లతావృక్షాదుల బుష్పింపజేయుటకై యవలంబింపబడు దోహదములలో నాయన వర్ణింపనిది లేదు వసంతవర్ణనలో నించుక తక్కువగా సగమీ దోహదముల కోలాహలముచే ఆయన దోహదపరిజ్ఞానము కూలంకషమైనది ఈ దోహదముల యాథార్థ్యము పరిశీలించుటకు బరిశోధనలు చేయించినచో బ్రభుత్వమువారిప్పుడు తలపెట్టిన వనమహోత్సవమున కెంతో వన్నె చేకూరును.

కాలము మార్పునకు గ్రహచలనము హేతువు ఏకాలమున నే గ్రహము లెచ్చటెచ్చట నుండునో జ్యోతిశ్శాస్త్రము వివరించును ఈ శాస్త్రమున జాతకభాగము మాట యెట్లున్నను సిద్ధాంతభాగము మాత్రము సిద్ధాంతమైనట్టిదే. రాయలవారి జ్యోతి

శాస్త్రపాండిత్యము గాఢమైనదే కాక యుక్తియుక్త సంపాదితమైనది కూడ ననుట కీ కావ్యమున ననేక దృష్టాంతము లున్నవి ఆయన కాలముమార్పును గ్రహచారవిశేషములతో సూచించును జ్యోతిశ్శాస్త్రమునందలి యొక్కొక్క యంశముపై నాయన యొక్కొక్క వింత భావము నుత్పాదించుచుండును వర్షకాలారంభము నాయన సూర్యుడు కర్కాటకమున బ్రవేశించుటలో నారంభించెను అంతలో నూరకుండక మూడవ యెడకు చేరు తరణి ధరణి ప్రమోదసంధాయియౌట సోదాహరణముగా నిరూపించెను ఒక పద్యమున నాతడు శృంగారకలాగ్రప్రశంస తెచ్చి యింద్రగోపములను రమణీయముగా వర్ణించెను వసంతకాలావిర్భావము నాతడు తరణి యుత్తరాశకు దొలగుటతో సూచించెను "శిశిర వలకేశు దండెత్తి కేతువగుట మీనమిలదోదు టుచితంబు, మేష మేషపని యనగ నేల" యని మీన మేష సంక్రాంతుల నిరూపించెను ఈ ఋతువర్ణనలలో రాయలజ్యోతిశ్శాస్త్రపాండిత్యము గంభీర భావసృష్టికి మూలమగుటయే కాక వాని కెడనెడ నాకారక శాస్త్రీయ గంభీరిమ నొసగూర్చెను

రాయలు సార్వభౌముడైనను సామాన్య మానవుల యాచార వ్యవహారములను, మనోభావములను సుఖదుఃఖములను చెక్కుచోట్ల నెంతో స్పష్టముగా వర్ణించియుండెను ఆయన ధనికుల మహాభోగము లందును సామాన్యుల స్వల్పసౌఖ్యములందును సమాదరము ప్రదర్శించెను వేసవిలో జాతిఫల శకలములతో గలపి నానిచిన చేపముక్కలు తిన్న కవలుపోవుటకై సంధ్యావేళల భోగులు "శశికాంతారాఖ్యంతరవాలుకాస్థిత హిమాంతర్నారికేళాంబువుల సేవించుటవలెనే యాతడు వర్షమున గుడుగుం జెందదలి మున్నాగాగల యామకూరలతో గూడిన భోజనము చేసి, కొమల్ పాలమునో గ్రేవుల్ మెయిల్ నాక" రెడ్లు మేకరువుల సంపటి మంచ పెట్టుటయు వివరించినాడు ధన్యులు తలిసి వెన్నెల బయళ్లను సమధిలిందు భోగములతోపాటు కాపుసత్పతుల పెన్గుబ్బలును పునాసలును హాలికులకు బిబిక్లుం బిసి క్లిష్టి కల్పించుటయు వివుకక వర్ణించెను అతని దృష్టి యతివిశాలమైనది, భావము సర్వసమత్వముతో గూడినది, ఊహ గంభీరసుందరమైనది

ఋతువు ప్రవేశించినప్పటినుండియు క్రమముగా దల్లక్షణములు పెంపొందుచుండును చివరికా లక్షణములన్నియు నొకదాని వెంట నొక్కటి యవ్యక్తమై యాగామి ఋతుచిహ్నములకు దావొసంగుచుండును ఈ పరిణామమును రాయలు తన వర్ణనలలో గడుంగడు నిపుణముగా నిరూపించుచుండును శకృతపయఃపానములైన క్షుప్రపృథుకములకు వడగండ్ల పాలపండ్లు రాలి బలాకావ్రజాలి సంప్రాప్తించి క్రమక్రమముగా పెరుగ ధ్వనియు గంభీరమయ్యెనట! ఇది బలాకామాలికాపవిత్రములైన కాదంబినుల సాక్షాత్కరింప జేయుటయే కాక వర్షర్తువు క్రమముగా నెట్లు విజృంభించెనో తెలుపుచున్నది. ఎలగోలుజల్లులతో నారంభించి క్రమముగా మిన్నుమన్నేకముగా గురిసిన వృష్టిపరిణామ మీ పద్యమున నెంత సహజముగా వర్ణింపబడినదో చూడుడు

ఎలగోలుజల్లు ముస్పెర పెళపెటవా
ల్పడి గాలివటింప్ల దడిసి చనగ
నట్టెత్తవసగండ్ల కట్టావులు దుమార
మావులుఁ రేచి రెంకెవదియు జన
మతిమూఢమది నిల్చి మెఱసి బిట్టుఱిమికి
కరవారిసృష్టి జీకటిగవలను
సుద్యోగులచేయుల నోజలైపై నంచి
జల్లుపై జల్లు పెల్లుల్లు కొనగ
భూభిదాపాది దుర్భరారంభ భరంపు
ఝడిమదుర్జ్రంభు దగలక కవిత వంచి
నట్లుమాగని ధారాఘు ధైర్యమంది
మిన్నుమన్నును నొకటిగా వృష్టిబలసె

అతి సూక్ష్మప్రకృతి పరిశీలనగున్నగాని యిట్టి వర్ణనము కావింప సామర్థ్యము కుదురదు ఇట్టి సామర్థ్యమును రాయలవారన్ని ఋతువుల వర్ణించు సందర్భమునను బుష్కలముగా బ్రదర్శించినారు

రాయలవారి రచన సర్వత్ర, ముఖ్యముగా వర్ణన సందర్భములం దాలంకారికమై యుండును మొత్తము ఋతువులవర్ణనకై వినియోగింపబడిన రెండు వందలపద్యములలో నేదో యలంకారములేని పద్యమే యుండదు అందును నుత్ప్రేక్షల సంఖ్య హెచ్చు ఊహాబల మెంత విస్తారముగా నున్న నుత్ప్రేక్ష యంత రమణీయముగా నుండును రాయలవారి యూహావిన్యాసము నిదమిత్థమని వర్ణింప నలవి కాదు ఆ యూహాబలముచే నాయన స్వర్గమర్త్యములకు సంబంధము కల్పించుచుండును దినముల వెంబడి మున్న మున్నీటిలో గ్రోలిన నీటిలో చేరిన ఘనఘట్టములవిరమ్మద దానవములు తెరులొక్కని పెటిలింప నార్పుటు లేమా యనగా సాంద్రఘనాఘన గర్భగోళములు తటిద్భయంకర స్తనితములను సృజించెనట! వరజాపెంబడిని రొంపిని ద్రొక్కుచుండ హాలికుల చరణముల నెవగివపసిడి చాయ కనుపులనీరుకైలు దుక్కియందు వారి కిడిన బిరుదు లేమోయన నొప్పారెనట! సర్వసాధారణము కాకపోయినను గల్పన యెంత సహజమనోహరముగా నున్నది! కవిశ్రేష్ఠులకే కాక హాలికశ్రేష్ఠులకును గండపెండేరముల నిచ్చుచుండ నుండలేకపోదు

గాజోలు వాకిలిపార్శ్వభాగముడు గ్రీష్మమున పెనము మీద చిందిపోయగా జొట్టుకొనగిన కట్టూలివలె జాడిది రొంగయ భూమండలమును పెనమున మాపటి పండువెన్నెల చకోరపాళి విరితిరి జాపట్టి పోసిన విధముగా నొప్పారెను "గ్రామ గ్రామంబున నాక పాకుంతుని కిడిన దలుకదప్పరములు తిర్చి చెదిరి గుంపటిలో దామరలవలె వట్టితతి" నొప్పారెను ఇద్భుటి యుపమాన మెంత స్వతంత్రసుందరముగా నున్నది! కరగున గాలిమంజరులు పండి ముదురై వాడి ముంప్లతో గూడియుండును అవి విష్ణువు నిద్రచేల్కొని భూదేవిపై వసుగిడగా నామె మేన బొడమిన పులకలవలె నొప్పారెనట! ఇట్టి భావనా సౌందర్యము లేని పద్యమొకటియు నీ ఋతువర్ణనలందు లేదు ప్రతి పద్యమునందు నేదోయొక విశిష్టమైన భావవిశేషము గోచరింపకుండ నుండదు ఇందు సహజమైన భావనకంటె నసహజములు సమయబద్ధములునైన యూహ లతిశయించినచోట్లును కొన్ని గలవు కాని యుదాత్తమైన గాంభీర్యమున్మాత్ర మెచ్చటను గొఱతపడి యుండలేదు.

రాయ లింత గంభీరముగా నీ వర్ణనల సాగించుచునే యెడనెడ శృంగారమిశ్రితమైన చక్కని హాస్యరసోక్తుల నల్లడించినపట్లును కొన్ని గలవు గంభీరముగా మొదలిడిన వర్ణన సాగి సాగి చివరికి దరహాసము కలిగించు సరసోక్తితో ముగియుట యిట్టి పద్యములలో గానబడు పరిపాటి వర్షకాలమున రవిజాచి కుకుచువారలకును గృకలాసములకును దృష్టిమిన్నులకె నిలుచుట యున్నవి విషయముల వర్ణించుచు చివరిగీతిగా నాయన యెట్లు ముగించెనో చూడుడు

అతిథిసంఘంబునకు నీవినట్టి యెడప
కగుపులే గలగమికి నాగట్టు లెసగ
మంటిమిద్దెలవారికి మసుపనులకు
సెలతి వానీనవారికి నిదుర చెడియె.

శైత్యారంభమున కిటి యుపసంహృతి కలుగునని మనము భావింపము ఇట్టే వంటవంటు నిల్లాండ్ర శ్లేకమును వర్ణించి వర్ణించి యాతడా సీసమును,—

అబ్జపటముఖ్యలయ మెన్న రాల యాంను
దారులయమెన్న రంతిక కారజనిక
వచన వాంథో గృహిణిరామి బశకమురుడు
విడివడిరె యార్య కౌగిలి రజ్జడిని గృహాంలు

అని ముగించును. వేసవిలో కొంథు డొవరించు వికార చేష్టలు చూడుడు దప్పికచే ప్రవకేరి యమ్మయక్కయని తూలుచు దోయి లొగ్గి ప్రపాప్రపాలిక లొసంగిన పానీయముచే వసి తేర నుండటి వాక్యము లెన్నిక యాతడు "కొనుమటుచ్బెలుస్ గడకొను కతుదీధికు లెగాదిగ చూడ"నారంభించునట! అట్టి పాంథుల జూచి పానీయము పోయు పాత్రముల మొగములపై విసరక సరసురాండ్రైన యాస్త్రీలు సన్నలచే నవ్వుచుందురట వారు నవ్వుట మాటలాడుచున్నను ఈపద్యము చదువునప్పుడు పఠితకు మాత్రము నవ్వు రాకతప్పదు

ఈవిధముగా రాయలవారి ఋతువర్ణనలు భావగాంభీర్యమునకును, ప్రకృతి పరిశీలన నైపుణికిని, సరస వాక్చాతురికిని నాలవాలములై యితర కావ్యములలోని వానికంటె నొకవిధమైన వైలక్షణ్యము కలిగియున్నవి అసలు రాయలవారి రచనమే ప్రౌఢమైనది ఈ వర్ణనలు మఱింత ప్రౌఢములుగా నున్నవి ఒక్కొక్క ఋతువునుగూర్చి యింత భావసామగ్రి యాయన యెట్లు చమత్కరించెనాయని చదువరుల కచ్చటచ్చట విస్మయము కలుగుచుండును కొన్నిచోట్ల నాతఁడొక వస్తువును వర్ణించి మఱికొంత దూరమేగిన తరువాత మరల నావస్తువునే వర్ణించుట కంగుకొనుచుండును ఒకే వస్తువునకు సంబంధించిన భావములన్నియు నొకచోట నుండుట సహజము అట్లు కాక యవి యందందు చెదరియుండుట కొంత వింత కలిగించును శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారీ ఋతువర్ణనలలో నితర కవుల పద్యములు కూడ గొన్ని చొచ్చియుండవచ్చునని యొక సందర్భమున జెప్పియుండిరి ఇందలి భావవైచిత్రిని, వస్తుగ్రహణమందలి పునరుక్తిని దిలకించినచో నీయభిప్రాయము సమంజసమే యని తోపక పోదు వర్షకాలవర్ణనమున నడిగంప్లయు నింద్రగోపములయు వర్ణనములు రెండుమూడు చోట్ల గానవచ్చు శరత్తునందల్లని మొయిళ్ళవర్ణనము పునరుక్తమైయున్నది వసంతమునందలి దోహదక్రియల వర్ణనము కొంత కృత్రిమమై యుండుట కవకాశమున్నది కవులలో ప్రసంగించు సందర్భమున నాయావస్తువులగూర్చి వారిచే పద్యములు చెప్పించి యందు దనకు రమణీయములని తోచినవానిని రాయలు తన కావ్యమున జొప్పించెనేమో యనిపించును కేవలవర్ణనలేకావున నట్లు చొప్పించినను గథాభాగమున విషయవిపర్యయము వాటిల్లదు అదియే యీ వర్ణన లింత దీర్ఘతరములుగా నుండుటకుగూడ హేతువేమో! కాని పద్యరచన మాత్రమంతట నొక్కతీరుగా నున్నది ఆప్రౌఢత, కూర్పు, పదప్రయోగము అన్ని పద్యములందును సమానమే అది పై యభిప్రాయమున కించుక బాధకము ఈ వర్ణన లెవ్వరిచే వ్రాయబడి యుండు నెట్టివైనను రమణీయములును, అసాధారణములును, సుదాత్తములునై యున్నవనుటలో మాత్రము సందేహము లేదు.

# కోయిలమ్మ



శ్రీ కాఖూరి హనుమంతరావు

ఈ తొలిసంజవేళ నిద
  లేయుటకు కోయని నిద్రపోవునా
లేఁగమనస్సులన్ నిదుర
  లేపెడువారలు?-ప్రాసఛందముల్
కై తలంటుచు నెంచుకొని
  కమ్మని తెన్గును బాడు సేయుమా
జాతిని నిద్రనుండి గుర
  జాడ కవీంద్రుడు లేపినట్లుగా

తొలిగాలుల కౌగిలిలో
కిలకిల నగి, యుదయభాను కిరణమ్ములలో
మిలమిల మెరసెడి చిగురా
కులమాటున బాటపాడుకోయిలగంటిన్

నన్నపార్యుసమాసముకన్న, కీట్సు
'ఊహ'కన్న రవీంద్రుని 'ఉపమ'కన్న
నామనోహరిమోవిపై నవ్వుకన్న
తీయగా, హాయిగా పాడె కోయిలమ్మ

"పలుకులందెల్ల మెత్తన తెలుగుపలుకు
తెనుగుకైతల మధురమ్ము తేటగీతి,
తేటగీతికకన్న నీ పాట యింపు,
ఆపకే ఆపకే నీదు అమరగీతి"

కర్కశ కఠోర శిలలెల్ల గరగిపోవ
నవని పులకింప మోడులే చిగురులెత్త
కవుల హృదయాలు మారు మ్రోగంగ
  నిపుడు
జగతి నింపవె నీదు స్వచ్ఛందగీతి.

ఈ యుషోదయసౌందర్య మినుమడించె
సంధ్య నీగాన పారవశ్యతను దోగ

కోయిలా కోయిలా యెందుకే యివేళ
నీదుగానమ్ములోన విషాదగతులు?

పొంగి హృదయమ్ములోనుండి పొరలిపోవు
నీవిషాద మాకసమంత నిండిపోయె
దాచుకోనేల నీవిషాదమ్ము నేడు
వింటివింటినిలే నీదు కంటినీరు.

చావు బ్రతుకుల మధ్య తేల్పంగలేక
మిగుల వేదనబడెడి హేమ్లెట్ ను వలచి
ప్రేమమరణమ్ము పొందు ఒఫీలియాయు
నీవలెన వస్రగాబోలు

పాడవే పాడవే హృది పగిలిపోవ
మధురమధురాతి మధురమౌ విధురగీతి,
జగతి మధురకావ్యములు విషాదభావ
పూరితములౌ, నిట్టూరుపులె పుచ్చు
  నవియె.

క్షణముక్షణమును మారు నీ జగతియందు
నేఁడుమాత్రము మారకే యుండిపోవు-
కళ కళాకారకే యనెడు నీగాన ఫణితి,
ఆపగారాని నాదు కళాపిపాస

నందగోపాలు వేణుగానమ్ములోన
లీనమౌ రాధికాసతి లీల నేను
గాన పారవశ్యతను లోకమ్ము మరచి
యెంతసేపుంటినో యేమొయెవ్వడెరుగు?

మొయిలునందులలోనుండి పయికివచ్చు
కిరణమటుభావ మొక్కటి మెరసె హృదిని
కలుగుగాక పునర్జన్మ, కలుగుగాక
అమరమాధుర్యమౌ కోయిలమ్మ బ్రతుకు.

నిస్తున్నారు. ఒకమూలలో మాత్రం కొంతమంది కన్యకలు గుసగుసలాడసాగినారు.

మెహరున్నీసా వీనులు జాగ్రత్తగా ఆమెకు వినిపట్టినాయి మాటలు స్పష్టంగా వినిపించసాగినాయి "అయ్యో! నా అందమా? ఏమున్నదే యిందులో చూడటానికి? పట్టినదాయి తప్ప! నాకేమీ కొన రాకడం లేదు. మన ఊళ్ళో నేటు చకురునేను వెళ్ళాం, ఎన్నోరెట్లు చక్కదనాల చుక్క కాదూ? అయిల్లాలి కాలిగోటికైనా యీమె పనికిరాదు!"—అంటూ ఒకతె ఆక్షేపించింది

"నీకేమో మృత్యువు గాపురించినట్టుందే?"— అని వేరొకతె దబాయించింది

"మంచే అందం కదాని వద్ద మెందుకే?"— అంటూ మొదటివ్యక్తి తన వాదాన్ని సమర్థించుకుంది

మెహరున్నీసా యీ సంగతిని కొంగున మూట గట్టినట్టు భద్ర పరుచుకుంది క్రమంగా మాడవచ్చిన జనమంతా సన్నగిలి పోయింది

అంతఃపుర ప్రవేశం కాగానే, దాసీలంతా బారులు తీరి నిలుచున్నారు సుగంధతైలాలూ, సుందరవస్త్రాలూ తయారు పెట్టినారు కాని, ఒక్కరినైనా సమీపానికి రానీయక మెహరున్నీసా నిరోధించింది "వంగదేశం సౌందర్యానికి గొడ్డు పోయినట్టుందే? అప్సరసల వంటి అంపగత్తెలుంటూ రమకున్నాను నా ప్రార్థనాని మీరాదాపురించారు? ఛీ! దూరంగా వెళ్ళిపొండి!"—

అవమానపడి, అవనతవదనలై, అంతా అక్కడే నిలుచున్నారు అంతలో షేరాఫ్గన్ అంతఃపురంలో ప్రవేశించి నిప్పు లొలికే నేత్రాలతో నిరుత్సాహంగా కనబడుతూన్న బేగంసాహెబా వంక చూచినాడు "ఇంకా నీవు "

"ఇలాగే కూర్చున్నావు దుస్తులైనా మార్చక—" అని కదా మీరు హెచ్చరిస్తున్నారు! కొంచెమైనా కళాదృష్టి లేని యీ పరిచారికలతో నాకు సాధ్యంకాదు మన్నించరూ!—

షేరాఫ్గన్ గుల్నార్! ఇలారా!—(అనగానే ఒకదాసీ ముందుకు వచ్చి నిలిచింది.)

మెహరున్నీసా దూరంగా నిలు! అందచందాలకు శరీరచ్ఛాయమాత్రమే ప్రధానం కాదు. అలంకారం చేతకాదు, స్త్రీలకేరీదమా—అబ్బా! ఆనవాళ్ళు మోస్తున్నావు. పో, పో!—అని యీసడించింది.

షేరాఫ్గన్ : గుల్షన్నా! ముందుకురా!—

మెహరున్నీసా వద్దువద్దు, గుల్షన్నా! నీకు పేరుపెట్టా, ఊరుదిబ్బా అనే సామెత సరిపోతుంది. నీలమేఘచ్ఛాయకదనే? పోయ్, పోయ్!—

షేరాఫ్గన్ నసీరా! ఎక్కడున్నావు? .

మెహరున్నీసా దురదృష్టమంతా నీమొఖాన్నే తాండవిస్తుంది చాలు! సమీపించడానికి సాహసించకు

షేరాఫ్గన్ గోవకా జహాం!—బేగం సాహెబాకు నీవే తగినదాన వనిపించుకో!—

మెహరున్నీసా పొగ్గకు దిష్టిచుక్క పెట్టినట్టుంది అది!—

షేరాఫ్గన్ హసీనా! నీవురా!—

మెహరున్నీ : ఏమి హసీనావే? కాటుక కొండా రమ్మంటే బాగుంటేదేమో?

"ఇంతమందిలో ఒకరూ నీకు నచ్చలేదా?"— అంటూ షేరాఫ్గను విస్తుపోయినాడు

"లేదు, ఇందులో నాకోపమం?"—అని మెహరున్నీసా పలికింది

"కావాన్నట్టు ఓర్చుకో!—రేపే కొంతమందిని ఆగ్రానుంచి పిలిపిస్తాను"—

"ఎందుకూ? అంత మాత్రం నాకైనరూ బర్ద్వానులో లేకనా?"—అని మెహరున్నీసా ప్రశ్నించింది

"సింహాలవేటలోనే నా నైపుణ్యం కాని, సింహమధ్యలను అన్వేషించడంలో కాదు"— అన్నాడు షేరాఫ్గను.

"ఆ సంగతి నాకు బాగా తెలుసు, మీరువట్టి అమాయకులని—వచ్చి రావసంతోనే పత్తా తీసి వందుకైనా, నాకు బహుమాన మేమిస్తారుమరి? చెప్తా, వినండి! ఈ నగరంలో నేటు చకురునేను యిల్లాలొక్కతే చక్కని చుక్క; ఆమెను నాదగ్గరకు పిలిపించండి!"—అని పద్మనయానం బయలు పెట్టింది మెహరున్నీసా.

"ఏమన్నావు? నేటు చకురునేనే!—అతడీ నగరానికంతా ముఖ్యుడైన వర్తకుడు. నాకంటె అన్నివిధాలా ధనవంతుడు. మహారాజా అక్బరుకు తెలిస్తే నాయుద్యోగానికే గండం తప్పదు. పేరంటాలుగా కొలువు నన్ను క్షమించాలనుకో!—" అన్నాడు షేరాఫ్గను.

"ఈ మాత్రపు మొదటి మర్యాదా చెల్లించ డానికి నీకు సామర్థ్యం లేదా? జ్ఞాపకముంచు కోండి! సింహాలనే కాని, సింహాసనాలను వేటాడడం మీ స్వభావం కాదని యిప్పుడే ఒప్పుకున్నారు ఇది మాత్రం తప్పదు ఈనాడే యిక్కడికి చతుర సేనుని శ్రీ వచ్చితీరాలి లేకపోయిందా, యీ పత్రాన్ని మారిత్రాగి పడుకుంటాను అప్పుడు తెలు స్తుందిగా? కిలాంపనో అక్బరు మీ ముప్పాత్తారి హెచ్చిస్తాడో తగ్గిస్తాడో? నేను మాత్రం మీకు దక్కను," నంటూ మెహరున్నీసా పట్టుపట్టింది.

షేర్ ఖాన్ సన్ముడైనాడు—"నీ మాటను పాలించబడుతుంది విచారించకు!"—అన్నాను వెంటనే నేటు చతురసేనుని ఒక లేఖ వ్రాసి పంపి నాడు "బేగం సాహెబా తను బీబీసాహెబాను చూడగోరింది వెంటనే ఆమెను పంపండి! సుఖ్ఖపు బగ్గీ అందుకోసం పంపుతున్నాము—" అని

చతురసేనుడా లేఖ చదివించి, చకితుడైనాడు తన వృద్ధజనకునికీ, యిల్లాలికీ చదివి వినిపించినాడు

సర్వసుందరి సలహాతో చతురసేను జవా బిచ్చినాడు, "నూతన దంపతులైన తమ కిద్దఱికీ మా కుటీరంలో విందుచేస్తున్నాము వచ్చే రేపే—వేళా- ముందుగా తెలిపి దయచేస్తే, సర్వసుందరి బేగం సాహెబా అనుగ్రహంతో తన అదృష్టాన్ని హెచ్చించుకోడానికి ప్రయత్నిస్తుంది తమ రాకను నిరీక్షిస్తున్నా" మంటూ

తిరుగు జవాబు రానేవచ్చింది మొదటి మాటను నే పరిపాలింపక తప్పదని కొందఱు సిపా యిలు కూడా వచ్చి సర్వసుందరీదేవిని మహలులో హాజరు పఱచమని హెచ్చరించినారు. ఇంతటి అవ మానాన్ని తాను సహించలేననీ, వెంటనే గౌరవం నిలబెట్టడానికి ప్రయత్నించమనీ, యింకోసారి చతురసేను ప్రార్థించినాడు

ఈసారి షేరాఖాను స్వయంగా విచ్చేసినాడు. చతురసేనుని కుటుంబమంతా—అతని ముసలితండ్రీ, భార్యా, కూతురూ—పరుగెత్తి పోవడానికి ప్రయ త్నించినారు కాని, అంతకుముందుగానే ఇంటి చుట్టూ కాపలాదారయింది చతురసేను ఖడ్గమాత్ర సహాయంతో పోరాడిపోరాడి తుదకు మాతుడైనాడు. సర్వసుందరి నిర్బంధింపబడి మహలులో మెహ రున్నీసా యెదుట హాజరు పెట్టబడింది చతురసేనుని తండ్రీ, కూతురూ, మిత్రభృత్యులు కావింపబడి, విడువ బడ్డారు.

అంతఃపురంలో సుందరీమణు లిద్దఱూ, ఒకరి నొకరి కొరకు చూచుకున్నారు. మెహరున్నీసా విజయగర్వాన్ని సూచించే నేత్ర విక్షేపంతో, "దేఖో జీ! నేటినుంచి నీవు నా అంగరక్షకు రాలవు. ఈ నా అంతఃపురంలో ఉన్న దాసీలకు రాణివి. నీకు నే పెట్టుకున్న ముద్దుపేరు జూలేఖా. తెలి సిందా?—" అని హెచ్చరించింది

"నా ప్రాణాలు కూడా తీయించి ఆ కొత్త పుణ్యం కట్టుకుంటే బాగుంటుందిగా?" అనింది సర్వ సుందరి, విషాదంతో వెక్కివెక్కి యేడుస్తూ.

"కంగారుపడకు! గతజల సేతుబంధన మెందుకూ? నా ప్రాణానికి ప్రాణంగా నిన్ను చూచుకుంటాను ఏమాత్రం నీకు లోపం రానీయ" నంటూ బేగంసాహెబా బుజ్జగించింది

"నా యిల్లు పాడుచేసినావు, నాలలాటరేఖ మార్చినావు, నా సిందూర తిలకాన్ని తుడిచి వేయించి, నా కుమార్తెను నాకు దూరంచేయించి, బ్రదికించడం మంచిదికాదేమో? ఆలోచించుకో! నన్నుగూడా హతమార్చితే, లోకంలో ఒకతే సుందరి మిగిలిఉంటుంది. ఆమె మెహరున్నీసా మాత్రమేనని ప్రపంచం ప్రశంసిస్తుంది" అని సర్వసుందరి నిర్భ యంగా పలికింది

"దేఖో జీ! ఈ పురుషజాతి గుణమే యింత!— నీ భర్తమూర్ఖుడై నన్ను చంపడానికి నిరాకరిస్తే, నా భర్త అంతకంటే మూర్ఖుడై అతన్ని వధించి నాడు ఇక నీవా సంగతి మఱచిపో! నీవు కోరితే యీ క్షణంలో నీ బిడ్డను పిలిపిస్తాను. ఇక్కడ నీకేమీ యిబ్బంది ఉండదుసుమా!" అని మెహ రున్నీసా యెంతో దయతో మాటలాడింది

"ఇంకా యిబ్బందులేమిటి? నాశరీరం దహించుకోపోతూంది నన్ను మిగిలిస్తే ఎన్నటికైనా మిమ్ముగూడా దహిస్తా నేమో? ఆలోచించండి!"— అని సర్వసుందరి తన మనోవ్యథను ప్రకటించింది.

"నీవు సామాన్యురాలవు కావనే సంగతి గ్రహించినాను. నాభర్తను లొంగదీసుకో గలవనే అనుమానం నాకు లేకపోలేదు కాని, నేను తగినంత జాగ్రత్తలో ఉంటాను పరపురుషులచూపు నీపై పడ కోదని గ్రహించు!"—అని మెహరున్నీసా హేళ నగా పలికింది.

"ఆవాడు నన్ను నీ కౌకరితగా అర్థంచేసు కున్నందుకు విచారిస్తున్నాను. నేను కొంచెము కొంతను ద్వితీయవివాహానికి పూర్తిగా విముఖు రాలను సుమా!"—అనింది సర్వసుందరి యేడుస్తూ.

"పరే! మంచిమాట. ఇంతటితో నీ అర్థం మదిలో పెట్టు! ఇంకా నీ హృదయంలో విషాదం మాని

పోలేదు. చిన్నగా వెళ్ళి విశ్రాంతి తీసుకో! నీ కుమార్తెను పిలిపిస్తాను. నిన్ను ప్రాణప్రదంగా చూసుకుంటాను నన్ను విశ్వసించవూ?" అని మెహరున్నీసా ఆమె నోదార్చింది

సుబుకాదు విచారించగా సర్వసుందరి కుమార్తెతో ఆమె ముసలిమామగారు మాయమైనట్టు వార్త వచ్చింది. ఎంత వెదకించినా పత్తా దొరకలేదు.

లాలీతల్లి, సర్వసుందరి, మెహరున్నీసాకు చెలికత్తె కాక తప్పలేదు ఆమె మరణించగలదు, కాని కసితీర్చుకోక చావడానికి హృదయం సమ్మతించడంలేదు.

దినమంతా సేవచేయడం—రాత్రి కసి తీర్చుకొందుకు ఉపాయాలు వెదకడం—ఈవిధంగా ఆమెజీవితం గడుస్తూ పోయింది. అప్పుడప్పుడూ తనకుమార్తెను చూడడానికి సుఖస్వప్నాలు కనడం కూడా అలవాటయింది

సర్వసుందరిని మెహరున్నీసా చాలా ఆదరించింది. ఆమె కేవలం పరిచారికమాత్రమే కాదు, ప్రాణసఖి, సలహాలిచ్చే మంత్రికూడా

సర్వసుందరి తలచుకుంటే విషమైనా యిచ్చి మెహరున్నీసా అంతాన్ని చూడగలదు చాలాసార్లు అవిధంగా కడతేర్చడానికి సమయాలు నిరీక్షించింది కాని, ఒక్కటే సుఖనిద్రపోనిచ్చినందువల్ల, లాభం లేదు "ఆమె హృదయాన్ని చేతనైనంత దుఃఖపెట్టి గాని చంపగూడదు, అప్పుడే తన కసితీరడానికి అవకాశం దొరికినట్టు అసలు చావులో ఏముంది? జీవితాంతం ఏడ్పిస్తే చాలు! అందుకుపాయం?"—అనుకుంటూ కాలం జరిపింది

కొన్నిసార్లు, "షేరాఫ్గనుకే విషమిచ్చి చంపితేనో?"—అనే ఊహకూడా ఆమెలో పొటమరించింది. మెహరు—అనాథగా మారిపోయి తన వలెనే యేడుస్తూ. "అబ్బే! అందులోనూ లాభం లేదు మెహరు హిందూ సుందరి కాదుగా! మన లావణ్యసుందరి, తప్పక రెండో పెండ్లిచేసుకుంటుంది. ఆమె సౌందర్యం చిరకాలస్థైర్యాన్ని యామపాడానికి సహాయపడితీరుతుంది అప్పుడో?—ఈ విధంగా తర్కవితర్కాలుమితిమీరిపోయాయి. ఇంతకూ ఏవిధంగానూ కసి తీర్చుకోలేక సర్వసుందరి నిత్యనూతనోపాయాలు అన్వేషిస్తూంది సంవత్సరం మీద సంవత్సరం గడచిపోసాగింది.

## 2

అక్బరుపాదుషా అనంతరం సలీము సింహాసన మెక్కినాడు జహాంగీరు బిరుదుకూడా ధరించి నాడు. అతనిహృదయంలో అప్పటికీ మెహరున్నీసా రూపం కంటక ప్రాయంగానే గ్రుచ్చుకొని ఉండిపోయింది. అతడామెనే మాత్రం మరచిపోలేదు

బర్ద్వాన్‌లో గడబిడ బయలుదేరింది వింకోలను కోటాకే తిరగాబడుడు షేరాఫ్గను 1607 మార్చి 80 తేదీన హతుడైనాడు ఈ హత్యలో జహాంగీరు చేయి ఉందో, లేదో ఈశ్వరుడికే తెలుసు చరిత్రకారుల్లో ఈ విషయాన్నిగురించి అనేకమైన మతభేదాలున్నాయి.

చచ్చేవాడు చచ్చినాడు. కాని, బ్రతికేవాళ్ళకు బ్రదుకు బరువునుగురించిన భయం పట్టుకుంది. చరిత్రమునకు విశదీకరించే విషయ మేమంటే—మెహరున్నీసా మొగలాయి రాజమహాలులో ప్రవేశింపక తప్పలేదు. ఆమెతో గూడా జాలేఖా సైతం అక్కడే చేరింది

అంతఃపురంలో రాజమాత సన్నిధిలో (అంటే అక్బరు పట్టపురాణి దగ్గర) మెహరున్నీసా మెదలసాగింది

పూర్వచరిత్ర సమాంతం మార్చడానికి జహాంగీరెన్నోపాట్లు పడినాడు కాని, మెహరున్నీసా గతించిన భర్తను తలచుకుంటూ, జహాంగీరు సంబంధాన్ని తృణీకరిస్తూ, కాలక్షేపం చేయడానికి ప్రారంభించింది

పాపం! జహాంగీరు హృదయంలోనో? ఆనాటి కానాటికి, ఆమెమీది వ్యామోహం పెరిగిపోసాగింది దినదినానికి మెహరు తృణీకారం కూడా అదే అంతస్థులో ఉండిపోయింది

అన్నివిధాలా ప్రయత్నాలు నిష్ఫలాలుకాగా, జహాంగీరు తుదకు జాలేఖా పాదాలమీద తన శిరస్సుపెట్టి యీవిధంగా ప్రార్థించినాడు "నీవు మెహరున్నీసాకు దాయవని సంగతి తెలుసుకున్నాను ఆశ్చర్యమేముంటుంది!—దాయైనా ఒక్కొకసారి మనిషిని వదలి దూరమౌతుంది, కాని, నీవో? అలాగ చెప్పడూ విడిచిపెట్టవు. నేడు భారతసామ్రాట్టు నీ పాదాలు పట్టుకున్నాడు; మెహరున్నీసాకు నిఖా కట్టించే భారం నీవు వహించాలి సుమా!—"

ఆనాటివరకూ జాలేఖా మనసులో, మెహరున్నీసాను విధవగానే ఉంచి తనూ చూడవలెనని భావం ఉండేది. కాని, యిప్పుడో? భారత చక్రవర్తి తన పాదాలపైబడి ప్రేమభిక్ష పెట్టుమని ప్రార్థిస్తున్నాడు. ఆమె హృదయం కరగిపోయింది. వెంటనే సాధ్యమైన సహాయం చేయడానికి జాలేఖా చక్రవర్తికి వాగ్దానమిచ్చింది.

"ఇప్పుడు తాతగారు స్వర్గవాసులైనారు. ముసల్మానుల యింట్లో ఉన్నప్పటికీ నిన్ను హిందూ స్త్రీగనే ప్రవర్తింపచేశారు. నీ హృదయం యెన్నటికీ ముసల్మానుల మతాన్ని కోరదని ఘంటాపథంగా చాటేవారు.

"మరణకాలంలో తాతగారు నన్నొక హిందూ గృహంలో ఉంచినారు. అమ్మా! నేనిప్పుడు భరతపూరు సిక్రీలో నివసిస్తున్నాను. ఎప్పుడైనా వచ్చి నన్ను చూచిపోవూ? నీ ప్రేమవల్ల సర్వదుఃఖాలూ మఱచిపోగలనని భావిస్తాను. ఎప్పుడు రాగలవు?

నీ కుమార్తె,

లాలీ"—

జాలేఖా, పాంతియా లేఖ పఠించి, ఆ వచ్చిన కాంతతో, "నిజంగా నా లాలీ బ్రతికే ఉందా?"— అని అడిగింది.

ఆ గంతుకురాలు సంభ్రమపూర్వకంగా, "ఔను" అని జవాబిచ్చింది. కూతురు బ్రదికే ఉందనే సంతోషంలో జాలేఖా పరవశురాలయింది. తానేమి చేస్తున్నదీ మఱచిపోయింది.

"ఇప్పుడే మలికాకు చెప్పి నా లాలీని పిలిపించుకుంటాను"—అని బిగ్గఱగా పలికింది.

ఆగంతుకి—"నీకేమైనా మతి భ్రమకలిగిందా? నీ కూతురి కాశ్రయమిచ్చిన వ్యక్తి మలికాకు బద్ధశత్రువుసుమా!—అంతేకాక, ఆమె నిక్కడకు పిలిపించుకోడం మంచిది కాదేమో?"—అనింది

"ఎవరైనా కానీ! నా లాలీని పిలిపించుకోగలను. రక్తపాతమైతే కానీ. జంగను మలికాకు నే నెంతో సేవచేశాను. ఆమె నా బిడ్డకోసం ఎంతైనా సహాయపడుతుంది. అవసరమైతే భాదా నా వెంట వస్తుంది. చక్రవర్తిని భాదా వెదిర్చి బ్రదుకగలవా? చెప్పు!"—అని జాలేఖా తొందరపడింది.

వెంటనే ఆగంతుకి యిటూ అటూ చూచి, యింకో లేఖ జాలేఖాకిచ్చింది. "దీన్ని కూడా పఠించి, నీ యిష్టప్రకారం సంచరించు!"— అనింది. ఆ లేఖ యీవిధంగా లిఖింపబడింది.

"సోదరీ!

మేవాడ్గను నీవు చేసిన దురాగతమంతా నాకు తెలుసు. ఆ కార్యమంతా మార్ఖాను ప్రపన్నురాలు కావడానికేనని కూడా నాకు విదితమే. నీ మామగారు చనిపోతూ పోతూ నీ కుమార్తెను నా అధీనంలో ఉంచినారు. ఈ అనాధబాలిక యెన్నెన్ని కష్టాలు పడిందో, యెక్కడెక్కడ తలదాచుకుందో తెలిస్తే మనుష్యహృదయం తల్లడిల్లిపోతుంది. నీభర్త జ్ఞాపకమున్నాడా? అటువంటి భర్త అన్యాయంగా హత్య చేయబడినాడు. కాబట్టి అతని రక్తం యెప్పుడూ కసి తీర్చుకోడానికి ప్రయత్నించి తీరుతుంది. మేవాడ్గను మరణించినాడు. నిజమే కాని, ఈ హత్యకంతా కారకురాలైన మలికా జీవించే ఉంది. ఆమె మీద కసితీర్చుకోవలసిన బాధ్యత నీకు లేదూ? నీ భర్త పవిత్రాత్మకు నీవు శాంతి చేకూర్చవూ? అన్నివిధాలా యీ ఉద్యమంలో నీకు సహాయపడటానికి సిద్ధంగా ఉన్నాను

నీ సోదరుడు,

భీమసేనుడు"—

ఈ లేఖ చదువుతోంటే జాలేఖా హృదయంలో నిద్రాణమైయున్న క్రోధాగ్ని—ప్రతీకారకాంక్ష— ప్రజ్వరిల్లింది. వెంటనే ఆమె, సందేశహారిణితో—"నీ పేరేమి? నీవు నన్ను సోదరుడైన భీమసేనుని దగ్గఱకు గొనిపోగలవా?"—అని ఆత్రంతో ప్రశ్నించింది.

"నేను భీమసేనుని గుప్తచారిణిని—'అంబరబాయి'—అంటారు నన్ను. అనుసరించే పక్షంలో నీ కుమార్తెనూ, సోదరునీ చూడగలుగుతావు"— అంటూ ఆగంతుకి జవాబిచ్చింది.

"ఇప్పుడే వస్తాను ఇక్కడే ఉండు!"— అని జాలేఖా వెంటనే మార్ఖాను దగ్గఱకు వెళ్ళి, "నా స్నేహితురాలు సెలవిప్పించవలెనని ప్రార్థన. భరతపూరు సిక్రీలోని ఒకానొక పీరుకు మొక్కుబడి చెల్లించలేకున్నాను. అనుగ్రహించరూ?" అని వేడుకుంది. మార్ఖాను సెలవియ్యడానికి అంగీకరిస్తూ—"తగినంత సిబ్బందినికూడా పంపుతాను వెళ్ళిరా!"—అంది

జాలేఖా అందుకు—"వద్దు, వద్దు; పీరుదగ్గఱకు ఏకాకిగా వెళ్ళవలెనని గదా పెద్దలంటారు? నేనొక్కతెనే వెళ్ళదలచుకున్నాను," అంటూ సమర్థించింది.

"మంచిది; వెళ్ళిరా,"మ్మని మార్ఖాను అనుమతిచ్చింది. అనాడే అంబరబాయితో కలిసి జాలేఖా భరతపూరు సిక్రీకి ప్రయాణమైంది

తల్లి కూతుండ్ర సమావేశమొక మహోద్వేగమైన ఘట్టం. వారిద్దఱూ పరస్పరబాహుబంధాల్లో పరవశులై ఉండిపోయినారు. కన్నీటి కాల్వలతో చెంపలు తడిసినాయి. హృదయస్పందనాలు తీవ్రమైనాయి. కొంతసేపటికిగాని జాలేఖా తనకూతురి సౌందర్యం చూచుకొని మురిసిపోవడం జరుగలేదు. బంగారుబొమ్మ అంత తీరంలో ఉండి తానెంతో ముచ్చట

"లక్స్ టాయ్‌లెట్ సబ్బు
నా చర్మమును మెత్తగాను, మృదువు
గాను, శుభ్రముగాను ఉంచును"
అని **ఎమ్. వి. రాజమ్మ** చెప్పుచున్నది




సినిమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు

"అన్నగారిని నీవు నేనే బులుపడి ఉన్నాము. కాబట్టి, షాహజాదా ఖుర్రం యీతర ప్రయాణానికి పూనుకోవాలి "

"షాహజాదాఖుర్రం నేనే యిక్కడకు రాగలను అతనిచేత నే వాగ్దానం చేయిస్తాను "

మరునాడు ఖుర్రంరానేవచ్చినాడు. రాగానే సర్వసుందరి దర్శనానికి వచ్చి, నమస్కరించినాడు ఆమె అడిగింది

"షాహజాదా ఖుర్రం! నేను మీకు సహాయ పడితే నాకు మీరిచ్చే బహుమానం ?—

ఖుర్రము వినమ్రుడై, "అమ్మా! నా మీ కుసుమ కాకో, అడగండి! తలతో చేస్తాను," అంటూ మాట యిచ్చినాడు

"ఖడ్గ హస్తులై ప్రయాణం చేయండి!"—

ఖుర్రము అదేవిధంగా ప్రయాణం చేసినాడు

మరునాడే సర్వసుందరి తన తమ్ముడుతనువదలి ఢిల్లీకి బయలుదేరబోతూ, 'అన్నా! సోదరి సంరక్షణలో జాగరూకుడవై ఉండు! నాకు సెలవా ?" అనింది

"సోదరీ! నిశ్చింతగా వెళ్ళిరా! ఇక్కడి శోభిత్కు ల వచన ప్రభావంవల్ల నాసోదరి భారతవర్ష సామ్రాజ్ఞి కాబోతుందని నమ్ముతాను సరేనా ?" అని భీమసేనుడు నవ్వినాడు

## 5

కొన్నాళ్ళపిదప అంబరబాయి, మహలునుంచి భీమసేనున కొక ఉత్తరం తెచ్చింది.

"అన్నా,

రహస్యాతి రహస్యమైన మీ పన్నాగమంతా మార్గదర్శకు తెలిసిపోయింది. షాహజాదా పర్వేజ్, సామ్రాజ్య సేనలతో వెంటనే బయలుదేరి మీ మీదికి రాబోతున్నాడనే సంగతి నాకు తెలియ వచ్చింది మొదట మిమ్ములను కొనగించే నిమిత్తం కొద్దిసేనమాత్రమే వచ్చి యుద్ధాని కాహ్వానిస్తుంది. మీరు పోరాడే సమయంలో హఠాత్తుగా మరొక పెద్దసేన ఖుర్రమును ముట్టడించి హతమార్చడానికి సిద్ధమౌతుంది. ఖుర్రం శిరస్సుకు మార్గదర్శి కట్టిన వెలువ రెండులక్షల మొహరీలు మాత్రమే. ఈ సేన లేవి రాకముందు, నీ దగ్గఱ కొక దూతవస్తాడు. అతడు నిన్ను మోసపుచ్చి, అరణ్యంలోకి తీసుకుపోవడానికి ప్రయత్నిస్తాడు. అక్కడ నిన్ను హతమార్చడానికి పన్నాగం పన్నబడింది.

పర్వేజ్, నాట్యగానాలంటే ప్రాణా లిస్తాడు కాబట్టి, యుద్ధప్రయత్నానికిముందే అతని నే నాట్యకర్తె వేషంలో హతమార్చడానికి పన్నాగపడుదు! నా ప్రతిమాటా జ్ఞాపక ముంచుకో! ఏమాత్రం ఏమరినా సరే, అనుకున్న కార్యం విఫ లమై తీరుతుంది సుమా!

` బాలిని కలుసుకోడానికి హృదయం తత్తరి స్తూంది. ఐతే, యీ సమయంలో మహలు వదలడం మంచిది కాదు

నీ సోదరి,

—సర్వసుందరి "

జాబు చదువుకుంటూనే భీమసేనుడు, మహా బత్ఖాను ఖుర్రములకు సమస్తమూ తెలిపి, తగిన సూచన లిచ్చినాడు

అదే సమయాని కొక దూత రొప్పుకుంటూ, రొప్పుకుంటూ రానేవచ్చినాడు ఆ దూత భీమసేను నితో, "షాహజాదా ఖుర్రం, అరణ్యంలో పులులను వేటాడుతూ, కూలిపడిపోయినాడు తమ రాక అగ త్యమని భావిస్తున్నాడు—" అన్నాడు

తక్షణం భీమసేను డా దూతను పట్టి బంధించ మని అనుచరుల నాజ్ఞాపించినాడు అనంతరం తగిన సిబ్బందితో అరణ్యానికి వెళ్ళి చూచినాడు అక్కడ ఖుర్రం పత్తా లేడు సరికదా! నలుగురు సిపాయీలు తన్ను చంపడానికి సిద్ధంగా ఎదురు చూస్తున్నారు ఆ నలుగురూ వెంటనే సప్రాణంగా పాతిపెట్ట బడ్డారు.

అంబరబాయి నాట్యకర్తెవేషంతో బయలుదేరి షాహజాదా పర్వేజ్ డేరాలో హాజరయింది. నాట్య గానాలకు అనుమతించమని ప్రార్థించింది.

పర్వేజ్ వెంటనే అంగీకరించినాడు అంబర బాయి నాట్యగానాలతో అతనికి, మత్తెక్కించి, సిపాయీలను మోసగించి, మంచి అవసరం చూచు కొని, కటారికి శత్రువును బలియిచ్చింది అందరూ కండ్లు తెరచేలోపల తప్పించుకొని పారిపోయింది కూడా

పర్వేజ్ మరణంతో మార్గదర్శి—జహాంగీరుల పన్నాగమంతా మొహం మొత్తింది

సర్వసుందరికి ధన్యవాదా లర్పిస్తూ ఖుర్రం స్వయంగా ఒకలేఖ వ్రాసినాడు.

పర్వేజ్ మరణించి జహాంగీరు దుఃఖసముద్రంలో మునిగిపోయినాడు. మార్గదర్శి దుఃఖంలో ప్రసన్నత కూడా కొంతవరకు ఉండి. ఒక కంటకం తొలగినా

తొలగిస్తేకదా?—అనుకుంది. ఇంక ఖుర్రం ముక్కలై మిగిలిపోయాడు!—కాని, . . . కాని. . .

జహాంగీరు దీర్ఘాలోచనలో పడిపోయాడు. తన రహస్యమంతా భీమసేనుడులాటు ఏవిధంగా తెలిసిందో? మహలులో ఖుర్రం పక్షాన గూఢచారు లెవరో కనిపెట్టమని అత డాజ్ఞాపించినాడు.

రెండో రోజుల్లో ఖుర్రం వ్రాసిన ధమ్మకీలాల లేఖ, చక్రవర్తి సన్నిధానంలో ఉంచబడింది ఖుర్రం హస్తాక్షరాలు గుర్తించిన తర్వాత చక్రవర్తి ఆ లేఖను నూర్జహాను వంక ఊరకున్నాడు. నూర్జహాను ఆ పత్రాన్ని చదివి అగ్గి లేకుండా మండిపడింది జాలేఖాను వెంటనే తన గదిలోకి రప్పించింది.

జాలేఖా నూర్జహాను ముఖాకవళికలలోనే, ఏదో విషమించి ఉంటుందని గ్రహించగల్గింది నూర్జహాను పండ్లు పటపట కొరుకుతూ, "ఏమే, విష నాగమా!—ఇంతవరకూ నీ విషం దిగలేదా?—" అని గర్జించింది

జాలేఖా భయంతో గడగడలాడుతూ, "ఈ సేవకురాలి తప్పేమిటమ్మా? మలికా సాహెబా కింతటి దురాగ్రహ మెందుకోనమ్మా?" అంటూ సవాలు చేసింది

"నిన్ను నమ్మి నా రహస్యాలన్నీ నీతో ఆలోచించడ మెందుకే ననుకున్నావా? నీవు నా మీదనే కత్తి కట్టడానికి పూనుకున్న సంగతి చూస్తే—ఆశ్చర్యంగా ఉంది"— అని అంగలార్చింది నూర్జహాన్

జాలేఖా ఆమె పాదాలు కండ్ల కద్దుకుంటూ, "ఎవరు నామీద చాడీలు చెప్పి, మలికా అనుగ్రహానికి దూరస్థురాలిని చేయదలచినారో?" అనింది

"నీవు సహచారిణి యూపంతో ఉన్నకాల సర్పావని"

"వాదోపం?"

"మహలులోని వార్త కిక్రుపులకు తెలిసిపోయింది మాకూ గాదా భర్త్వానను హత్యచేయించి వాళ్ళు, ఖుర్రమును బంధించినాళ్ళు. నా సామ్రాజ్యానికి అడ్డుగోడైన వాళ్ళు ఇందుకు కూడా తెలిసి ఉందిగా?"

"తప్పఘోరమయిందే అపరాధికి మరణదండన తప్పదుగా? కాని, నా యోజనమంతా నీచేతలో ధారపోసినాను [illegible]లో ఉంచాళ్ళ లేని తోటానికి నన్ను బలిచేయు[illegible]?"

"ఉంచాళ్ళ కోలుకున్నావా? ఇదుగో! చూడు," అంటూ ఆ లేఖను ముఖాన విసరికొట్టింది, నూర్జహాను.

జాలేఖా ఆపత్రాన్ని చదువుతుంది ఆమె. దంత అహంకారం హరించిపోయింది ముఖంలో నెత్తురు చుక్క లేదు. ఐనా ధైర్యం తెచ్చుకుంటూ, "ఈలేఖ కిక్రుపుల తమ్మాగం. అంతమాత్రం కనుక్కో లేవా? మలికా సాహెబా!—"అంటూ ప్రారంభించింది.

"నేనేమి వనిబిడ్డ ననుకున్నావటే? నోరు మాట్లాడితే నాలుక చిక్కరిస్తాంది. జాగ్రత్త! నీకు మృత్యువుమాత్రం తప్పదు కాని, యిన్నాళ్ళు నీవు చేసిన సేవకు బహుమానంగా—ఏదైనా నీ అంతిమ వాంఛ తీర్చడానికి సిద్ధంగా ఉన్నాను. అడుగు!"— అనింది నూర్జహాను గర్జిస్తూ

"ఈ సేవకురాలు మరణానికి భీతిల్లదు మలికా అనుగ్రహం తప్పిన తర్వాత బ్రతికిమాత్రం నేను సాధించేదేమిటి? భరతపూరు సీక్రిలో నా ప్రాణసఖి అంబరబాయి ఉంది నాశవాన్ని ఆమెదగ్గర చేర్చడానికి అనుమతించండి! హిందూధర్మాన్ని అనుసరించి నేను దహనమై పోవడానికి వాంఛిస్తాను. కాబట్టి బ్రాహ్మణులే నాశవాన్ని మోసుకోపోయే యేర్పాట్లు చేయించండి! ఇదుగో! నేనే స్వయంగా విషం త్రాగి మరణిస్తున్నా," నంటూ జాలేఖా ఒక విధమైన పొడినిపోట్లా విప్పుకొని నీళ్ళ త్రాగింది. అరగంటసేపటిలో ఆమె స్పృహ తప్పి క్రిందబడిపోయింది.

నూర్జహాను ఆజ్ఞానుసారం సర్వసుందరి దేహం బ్రాహ్మణుల స్వాధీనం చేయబడి, భరతపూరు సీక్రిలోని అంబరబాయికి చేర్చబడింది. అక్కడ హిందూ ధర్మప్రకారం దహనసంస్కారాలు జరిపించవలసిందని సందేశంకూడా పంప బడింది.

## 6

ఇతిహాసాల్లో లిఖింపబడ్డ రీతిగా మహాబత్ ఖాను జహాంగీరును పట్టుకొని, బలవంతంగా సామ్రాజ్యాధికారం ఖుర్రంపరం చేయబడ్డట్టు వ్రాయించుకోడమూ నూర్జహాను భర్తను మళ్ళీ విడిపించుకొని, మహాబత్ కోసం కడపటిసారి ప్రయత్నించడమూ జరిగినాయి. ఈ సమయాల్లో జహాంగీరు విశేషంగా మదిరాపానం చేసినాడని, అతని ఆరోగ్యమంతకంతకూ క్షీణ మౌతూ పోసాగిందని, చరిత్రలే తెలుపుతున్నాయి. ప్రజలు కూడా చిరకాలం జహాంగీరు బ్రతుకలేడనే సంగతి తెల్సుకున్నారు. గాలిమార్పు దానికి [illegible] ప్రయాణం నిశ్చయించబడి, అంతా తయారయ్యే సమయంలో [illegible] నూర్జహాను కీవిధంగా లిఖింప బడిన పత్రమొకటి అందింది.

శ్రీ సాహెబా హృదయా,

నీకూ నాకూ సంబంధ మీనాటితో తెగిపోయింది. నీవు నీ సౌందర్యగర్వంలో విర్రవీగుతూ నా భర్తను హత్యచేయించి, నన్ను దాసిగా ఏలినావు. నా యౌవన భోగాలన్నిటినీ నాశనం చేసినావు. తల్లికి బిడ్డా బిడ్డకు తల్లీ లేకుండా చేయునుంచినావు నన్ను కనాకష్టంగా పోషిస్తూ రొట్టె ముక్కలతో సంరక్షించడమే మహోపకారంగా భావించినావు అధికారం హస్తగతమైనదనే పొగరుతో, యిష్టానుసారం చలాయించ సాగినావు ఇంతైనా నే నోర్చుకున్నాను ఎందుకో తెలుసా? నీమీద కసితీర్చుకోడానికే ఎవతె నా యౌవనాన్ని సర్వనాశనం చేసిందో, ఆ పాతకురాలి వృద్ధాప్యాన్నైనా నాశనంచేయక నేను వదలగలనా? అందుకై మహలులో నిప్పుపెట్టించి, రాజధానికి తోడ్కడసాగినాను ఆ మంటల్లో నీ విప్పుడు దహించుకోపోతున్నావుగా? నీవు నన్నపరాధినిగా నిర్ణయించి మరణదండన విధించినావు మూర్ఖురాలా! నేను విషపానం చెయ్యలేదు పండ్రెండు గంటలసేపుమాత్రమే స్పృహలేకుండా చేయగల ఔషధాన్ని సేవించి, నీ బంధాన్ని తప్పించుకున్నాను నే మద హావం కాలేదు ఇక్కడి నా బంధువులు నన్ను రక్షించినారు స్పృహవచ్చి కండ్లు తెరిచేసరికి నేను సరిగ్గా నా సహోదరుడైన క్షేమసేనుని సముఖంలో ఉన్నాను

కిరాతకురాలా! నీమీద పగ సాధించడానికే నే నిన్నాళ్ళనుంచీ జీవించగలిగినాను ఇప్పుడు నిన్ను నే నడుగుతున్నాను ఏమిటి నీకు శిక్ష? నీవు మరణమే కోరినా, నేను కాదంటాను నిన్ను సజీవంగా కాల్చి కాల్చి నేను కనులారా చూడదలచుకున్నాను. అప్పటికే గాని నా హృదయం శాంతించదు.

ఇంకో మాటమాత్రం విను! షాహజాదా ఖుర్రం నా సహాయమర్థించి, నే నడిగిన బహుమానాన్ని నా కివ్వడానికి ప్రమాణం చేసినాడు అతనికి సహాయ పడటంలో నేను నీవల్ల ఏమీ కోరలేదు. అతని అభీష్టమేమో తెలుసా? నా కూతుర్ని పట్టపురాణి చేయడమే నే నందుకు సమ్మతించి, నా ముద్దులకూతురైన లాలీని అతని కిచ్చి వివాహం చేసినాను ఆమె 'ముంతాజ మహలు' పేరుతో సామ్రాజ్ఞీపీఠాన్ని అలంకరిస్తుంది అప్పుడు నీ కూతురు కీ అంధకార మందిరాల్లో బందిగా ఖైదు చేయబడుతుంది నీ అల్లుడూ సహా ఖైదులో ఉంటాడు, నీ జీవానికి ఏడుస్తూ కాలం గడుపుతావు, నీవు జీవించిఉండి యీ దృశ్యాలన్నీ చూస్తూ విచారపడగలవు. జహంగీరు ఆయువు తీరినట్టేగా! ఈ కలాపమంతా జరగడాని కెంతో కాలం పట్టదు

భావిభారత సామ్రాజ్ఞి మాత,
—సర్వసుందరి"

కాశ్మీరు యాత్రానంతరం జహంగీరు వ్యాధి పీడితుడై మరణించడం చరిత్రప్రసిద్ధమే నూర్జహాను ఆ సంగతి బొక్కనీయకుండా అతని శరీరాన్ని ఏనుగుమీద ఉంచి, ఊరేగింపులో కొనివచ్చింది కాని, సత్యం దాగుతుందా? మహబత్‌ఖాను ఖుర్రమును పిలిపించి, వెంటనే సింహాసన మెక్కించినాడు సామ్రాజ్యాపేక్షగల మొంగలు కుటుంబీకులందరూ కడతేర్చబడినారు షహార్యారూ, నూర్జహానూ తుదకు జయించలేకపోయినారు సర్వసుందరి ఆజ్ఞానుసారం షహార్యార్ అంధుడై బందిఖానాలో ఉంచబడినాడు అతని బీబీ వేరొక గదిలో బంధించబడింది నూర్జహాను మహలులోనే నిర్బంధితురాలయింది అనుకున్నట్టుగానే లాలీ, సామ్రాజ్ఞీపదాన్ని అందగలిగింది

సర్వసుందరి కడపటిసారి నూర్జహానును దర్శించి సలాముపెట్టి నిలుచుంది "ఏమే, ద్రోహీ! ఇదంతా చూడడానికే గదా నీవు జీవించింది? ఇప్పటికి నీ కన్నీరు చూచి నా హృదయం శాంతి వహిస్తుంది రూపగర్వంతో నీవు చేసుకున్నదాని ఫలితమంతా అనుభవించు! ఛీ! నీ ముఖం చూస్తేనే పాపం లభిస్తుంది"—

నూర్జహాను తలవంచుకుంది కన్నీరుమాత్రం కాల్వలుగట్ట ప్రారంభించింది తర్వాత సర్వసుందరి నెవ్వరూ చూడలేదు ఆమె బర్ద్వానుకు వెళ్ళి, తనభర్త షేరాఫ్గన్ చేత వధింపబడ్డచోటనే చితి పేర్చుకొని, భస్మమైపోయింది.

# ఉదయగిరి నవాబు దానపత్రిక



శ్రీ పొంగూరు సూర్యనారాయణ శర్మ

శ్రీ మనుమసిద్ధి మహారాజ పాలితమై, కవి బ్రహ్మ కవితా కలితమై, ఖడ్గతిక్కన భుజబల రక్షితమై పావన పినాకినీ ప్రవంతీజల పూతమైన నెల్లూరు మండలమున ఉదయగిరి దుర్గము చరిత్ర ప్రసిద్ధిగాంచినది. ఇయ్యది నెల్లూరునకు పశ్చిమోత్తర దిగ్భాగమున ఏబదిమైళ్ళ దూరమున నున్నది. ఈ దుర్గము పర్వతాగ్రమున శత్రుజన దుర్భేద్యముగ నిర్మింపబడినది. కొంతకాలము దీనిని గజపతులు ఆక్రమించి పాలించిరి. క్రీ॥ శ॥ 16 వ శతాబ్దమున శ్రీ కృష్ణదేవరాయలు ఉత్తర దిగ్విజయమునకై తిమ్మరుసుచే పురికొల్పబడి యపార సైన్యసమేతుడై ప్రప్రథమమున నీ దుర్గమును ముట్టడించెను. దీని ముట్టడి సుమారు పదునెనిమిది నెలలు సాగెను. శత్రువు లెంతకాలమునకు లొంగనందున రాయలు, కొండమరుసయ్యయను సేనాని అతి శ్రమంకోర్చి కొండలను పగులగొట్టి మార్గమేర్పరచి దుర్గమును స్వాధీనము చేసికొనిరి, కొండమరుసయ్యను దుర్గాధ్యక్షునిగ జేసి రాయలు కొండవీటి విజయయాత్రకేగెను. విషయము చారిత్రకు లెఱింగినదే. రాయలచే సంవత్సరమునకు పైగా ముప్పుతిప్పల బెట్టిన దీ దుర్గమని వేఱుగ చెప్పవలెనా?

17 వ శతాబ్దారంభమునకే హిందూ ధర్మ సంరక్షకమైన విజయనగర సామ్రాజ్యము ఛిన్న భిన్నము కాగా వారి పాలనలో నుండిన దుర్గములు మహమ్మదీయుల పాలయ్యెను. ఉదయగిరికూడ అట్లే నవాబుల పాలనలోనికి వచ్చెను. నేడిది ఉదయగిరి తాలూకాగా ఎన్నబడుచున్నది. ఈ ప్రాంతమున కంతయు పూర్వము ముల్కనాడను పేరుండినటుల ప్రాచీన పత్రములవలన తెలుచున్నది. దీనికి ముల్కనాడను పేరెట్లు వచ్చెనను నది విచారణీయమైన అంశము. శాసన చారిత్రకులకే వదలివేయుచున్నాము. ఈ నాటిలో నుండిన బ్రాహ్మణులు ముల్కనాడు (ములికి నాడు) వారని ప్రసిద్ధినందిరి. వీరు క్రమముగ కడప మండలమునకు మఱి యితర మండలముల కేగిరి. సంగీత లోకమున భక్తలోకమున చిరకీర్తి గాంచిన శాకల్య త్యాగరాజు తాత గిరి రాజకవి నాయక రాజుల కాలమున తంజావూరున కేగెను. అట్లే ఆ కాల కుటుంబములు మధురాది దాక్షిణాత్య మండలముల కేగి నివాసముల నేర్పఱచుకొనిరి. నేటికిని వారు ములికినాటి వారమని చెప్పికొనుచున్నారు. వీరందఱు నూటికి నూరుపాళ్లు ఆంధ్రులు. ఉదయగిరి మండలమున (ముల్కనాటి) నివసించిన విప్రులు విశేషముగ వేదశాస్త్రాది విద్యలలో పరినిష్ఠిత పాండిత్యముగలవారై యుండినందుననే దేశాంతరములకేగి అచటి ప్రభువుల మెప్పించి భృతిని గడించిరను విషయము నిస్సంశయము.

ముల్ ముల్క అను పాదుషా పాలనలో నుండినందున నీ దేశమునకు ముల్కనాడను పేరు వచ్చెననుచున్నారు. ఈ నిష్పత్తి పూర్వోత్తర విరుద్ధముగ నున్నది. రాయలనాటికే యిచటి విప్రులు ఈ పేరుతో ప్రసిద్ధి వహించి యుండినటుల తెలుచున్నది. తత్పూర్వమీ దుర్గమును ముల్ ముల్క పాలించెనా? ఆధారములు లేవు. ఈ ముల్ ముల్క ఎవరు? ఏది యెట్లున్నను ఆంగ్లేయులీ దుర్గము నాక్రమించుకాలమున నిది మహమ్మదీయుల పాలనలో నుండినది. వారు మహమ్మదీయుల నోడించి, అచటి రాజవంశీయులకు భరణమిచ్చి స్వాధీనము గావించుకొనిరి. ఇప్పటికి నాయూర మహమ్మదీయులే అధిక సంఖ్యాకులై యున్నారు.

ఇచట పాలించిన నవాబులు హిందువులయెడ వైరము చూపక యచటి పండిత బ్రాహ్మణుల పోషించి కొండాడి కానుకలిచ్చి మడి మాన్యముల నొసంగిరి. ఉదయగిరికి పశ్చిమమున పొంగూరు అను గ్రామమున శ్రౌతస్మార్త నిత్యకర్మ నిష్ఠాగరిష్ఠులై, యజ్ఞయాగాది కర్మ పరతంత్రులై, నిత్యాగ్నిహోత్ర

ధూమపవిత్రమై తన్నెక్కెక్కిన విప్రకుటుంబ మొకటి యుండెను. అయ్యది హిందూ సాంప్రదాయమును నను సరించిన సంయుక్త కుటుంబము. అందు కనుమళ్ళ వారు, పేరుభొట్లువారును గలిసియుండిరి ఇందు కను మళ్ల ఎల్లు భొట్లు యజుర్వేదము నభ్యసించి, సాహి త్యమునందు ప్రవీణుడై శిష్యబృందములకు విద్యగ ఱపుచు జీవించెనట అతడు క్రీ శ 17 శతాబ్దిలో నుండినవాడు అప్పుడా ప్రాంతమున వర్షములేక పాడిపంటలు శూన్యమై జనుల జీవనము దుర్భరముగ నుండెను వీరికి నానాటికి జీవనము దుర్భరము కాగా, బియ్యము లేనందున నింట జొన్నసంకటియే తినగల్గురుర్యాను ఎల్లు భొట్లు భార్య ఓలుకమ్మ విస్త రిలో జొన్నసంకటిముద్ద వడ్డింప నాతడు తినలేక అట్టే దీనవదనముతో భార్య మోము చూచెనట ఆమెయు వంటనే "ఏమి చేయుదురు పిల్లలు ఏడ్చి ఏడ్చి మ్రింగలేకున్నారు మీరేమో వేదపారా యణం పాఠాలతో కాలం గడుపుతూ యిల్లు వదల కుంటే బియ్యం ఎక్కణ్ణుంచి వస్తాయి, ఏ రాజునో ఆశ్రయించి యింత వరిమడి సంపాయించక పోతిరి దాహామైనపుడు బావిలేక పోయెనే అనుకుంటే యెలా ? తినండి" అన్నదట అతడున్న పాళమున నే లేచిపోయి ఆనాడెట్లో గడిపెను మరునాడు కాల కృత్యముల నిర్వహించుకుని కాలనాటి శాల్వ భుజ మున ధరించి హటాహుటిని ఉదయగిరికి ప్రయాణ మయ్యెను భార్యా చూచుచు ఎచటికి ? అని యడు గుట దుశ్శకునమని యూరకుండ ఎల్లు భొట్లు మధ్యాహ్న మగుసరికి ఉదయగిరి దుర్గమును చేరి బాజారముకడ నున్న భటులను చూచి "నవాబు దర్శనం కావలెను" అనగ వారు "కొత్త బిచ్చగాడు బ్రాహ్మణుగడట" అని గేలిచేసి నవ్విరట ఎల్లు భొట్లు ఉడుకుడుకు పింజముగావున వారిని త్రోసి రాజన సాగవారు ఈ సొటలను బాజారమున కట్టిపెట్టిరట ఈతడు రాజరాజేశ్వరి యుపాసకుడు సిద్ధినందిన వాడుగాన వారి యాటి లాండొకటి అతుకునాను లాగున చేసి యూరక నిలువబడెనట భటు లీకెలు రాక బ్రాహ్మణుడేమో చేసెనని గోలచేయసాగిరి జనులు గుంపులుగ చేరిరి అప్పటి యుదయగిరి పాల కుడు "షాంఖరకుష్ఖానే అలం హాంకేను కుశుకర్గి ఖాను ఖాసాహెబు." అతడీ బజారములోని సంగతి తెలిసి వెంటనే వచ్చి యెల్లు భొట్లను లోనికి గొంపోయి యుచితాసన మొసంగెనట అంత నీతడు మంత్రా క్షతల నొసంగి,

"దుర్గ మేదోద్భవయగిరా, భానుర్భానురివోదితః
తస్య ప్రకాశనవశా, ద్భాతి సః కమలంమమః"

అని పల్కి రాజును మెప్పించెనట. దుర్గాధిపతి యీతని మహిమ ముందే యెఱింగిన వాడగుటచే "తమకు కేమి కావలె ? ఏలవచ్చితిరి ? అని యడుగ" మా గ్రామము చుట్టుపట్ల ఎక్కడా వర్షాలు లేవు కుంటలు చెరువులు వట్టిపోయి ఒక గింజైనా వస్తు పండుట లేదు మేము శ్రోత్రకర్మలు చేసేవారము బియ్యము లేకున్న జరుగదు పిల్లా జెల్లా మాడిపోవుచున్నారు. తమరు దయచూసి వరిమడి పెన్న ప్రాంతంలో ఇప్పించండి" అని యడుగ నవాబు వంటనే దివా నుతో నాలోచించి అల్లూరులో (ప్రస్తుతం కోవూరు తాలూకా) మీకు భూమి యిచ్చేలాగున ఆజ్ఞలిచ్చాము మీరు సుఖంగా జీవించండి" అని గౌరవించి పంపగా ఎల్లుభొట్లు అల్లూరు గ్రామమునకు కుటుం బముగా బయలుదేరి చేరెను అప్పటికే కాపు కరణా లకు నవాబు ఆజ్ఞలు చేసియుండెను గనుక వారు వీరిని గౌరవించి యీ క్రింది దానపత్రికను వ్రాయించి యిచ్చిరని మా కుటుంబపు పెద్దలవలన వినినగాథ నిందుపొందు పఱచితిని

దానపత్రిక (హద్దు పత్రిక అని పేర్కొనబడి యున్నది) కాలము శాలివాహన శకవర్షము 16 18. నేటి అనగా 1952 క్రీ శ సమానమైన శాలివాహన శకవర్షము 1875లో త్రోసి వేయ నీపత్రిక కాలము నేటికి 257 సంవత్సరములగు చున్నది అనగా క్రీ శ 1695 అగుచున్నది ఇట్టి పత్రికలో సుదహరింపబడిన ఏదుం విత్తనాం పట్టు వరిమడి మాన్యముగా నీయబడి నేటివఱకు మాన్యముగా అనుభవించుచున్నది ఈ పత్రిక మాయింట 257 సం నుండి శిథిలముగాక దాచబడియున్నది

ఈ పత్రిక చేతితో చేయబడిన కాగితముపై చక్కని ముత్తెములవంటి తెలుగులిపిలో వ్రాయబడి చెక్కుచెదరక యున్నది రెండున్నర శతాబ్దిక పూర్వ మాంధ్రభాష, లిపి, ఆనాటి మనుష్యుల మత సాహుకర్యములను, భిన్నాభ్రితికి భియ్యని

దృష్టాంతముగుటచే చారిత్రక విమర్శకుల వినోదార్థ మీ క్రిందదానిని పొందుపఱచు చున్నాను—

పత్రిక నకలు

శ్రీరాములు—

"స్వస్తి శ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వర్షాంబ్బులు ౧౬౧౭ అగునేటి బహు ధాన్యనామ సంవత్సరమాఘ శిర శు ౧౫ లు శ్రీ మద్యజవాది మట్కూ౯ నిరతులయ్యు కనుమోళ్ళ యల్లుభొట్లు గారికి అల్లూరు కౌపు కరణాలు వ్రాయించ్చి యిచ్చిన భూర్గు పత్రికె పాజరకుఖాకె అలం హుకెము కురు వర్ది౯ భామిసాహెబులవారు కసుబా అల్లూరులో పొలంలో శింగ్గాంబ ౦౧౦ యేమంనిర్తవాలు పట్టువరి మడి రెంస్డు వరహాలకు శెడ్గెమాన్యం మీకు యిన్య మని శెలవు యిచ్చినారు గనుక ఆదేశ్రప్రకారం సదరు గ్రామపొలంలో శింగ్గాంబ ౦౧౦ యేగ్గుం నిర్తనాలు పట్టుమా బక్క పోలయచేను రెంగ్దు వరహాల్కు శెడ్డి మాన్యంగ్గా నిమ్కూరు౯ చేశి యిచ్చినందుకు హద్దులయ్యం

పడమరకు నాగరాజు యీనచేరికి పాశకొల్వ దక్షిణానకు సదరు కౌలకు తూర్పునకు నాగరాజు చేను పడమరగని కెంయునకు పరియపరుజు ఉత్తరానకు పల్లాపురిగెలు కౌలకు యీ హద్దులలోగా వుండ్డె భూమి మీ పుత్రపౌత్ర పారంపర్యయం ఆచంద్రార్కం స్థాయిగా మాన్యంకింద్ద అనుభవించు కొని యీ రెంన్డు వరహాలు శెడ్డిదివానానుకు చెల్లించ్చి సుఖానవుంమంకు చేది దానపాలనయో మహాధ్యేశ్ర దానా శ్రేయోనుపాలనం దానాత్స్వర్గ మవాప్నోతి పాలనాదచ్యుతం పదం

అక్కరాజు పెరుమా
ళ్ల వ్రాతకరణీకం
వ్రాలు—

ముత్తరాజు నారా
యణప్పవ్రాలు-
అన్నదాత నారా
యణవ్రాలు
అన్నదాత భాస్కర
య్యవ్రాలు
అన్నదాత బాలిరాజు
వ్రాలు-
యరబోలు బుగ్గా
రెడ్డి వ్రాలు-"

నేటివ్రాత పద్ధతికి ఆనాటి పద్ధతికి గల వ్యత్యాసములు: వర్ష, మాఘ శిర, కురు వర్ధి౯ పూర్వ౯ ఇని నేడు వర్ష, మార్గశిర, కురవర్ద్ధి, పూర్వ అని రేఫక్రింద వల్లులను వ్రాయుచున్నారు ఆనాటి వ్రాతలో రేఫ హల్లుం యోగములుగా క రకారపొల్లు (పొల్లుగేఫ) యే వాడబడినట్లు తెలియు చున్నది అరబీ సంపర్కముచే "పత్రికె" అనుచోట పత్రిక అనుటకు మారు ఏకార విశిష్టముగ వ్రాయుట పారంపర్యం అనుటకు మాఱు పారంపర్యయం అని యద్వయములు వాడబడెనో చింత్యము. కింద్ద, చెల్లించ్చి, రెంన్డు అని కింద, చెల్లించి, రెండు అనుటకు మాఱుగా వ్రాయబడి యుండుటచే, పద్యాంత్య హల్లులు ద్విత్వ విశిష్టముగా వ్రాయునల వాడుల ఎట్లు వచ్చెనో పరిశోధింపవలె

ఇట్టి ప్రాతప్రతులు అటనట శతాబ్దముల తరబడిని యుండినచో నచ్చును అట్టివి గలవారు ప్రకటించిన అనేక విశేషములు కన్పించి భాషా శాస్త్రజ్ఞుల కెంతయో తోడ్పడును.



# కడపటి వివేకం

★

శ్రీ చేకుమళ్ల కామేశ్వరరావు

చింతా సాగరానికి ఆర్థిక బాధలులేవు. తాత తండ్రులు ఇచ్చి పోయిన ఆస్తి పోలేదంత ఉంది. కుటుంబమైనా కనీసపు మెట్టు దాటిపోలేదు. అతను, భార్య, ఒకే ఒక బిడ్డడు. తనకి సొంతంగా బాధలులేకపోవడమే కాకుండా కొందరిలాగు ఇతరుల బాధలను నెత్తిమీద వేసుకోవే గుణంకూడా అతని దగ్గరలేదు. "పాపం! అదంతా సంఘసంస్కర్తల పని!" అని తెగ నవ్వుతాడు

చింతాసాగరానికి స్నేహితులైనా మితంగానే ఉన్నారు. అతనితో చర్చించడమంటే వాళ్ళకి సరదా! వాళ్లతో వాదించడమంటే అతనికి సరదాయే! దీనివల్ల ఒక రకమైన ప్రయోజనం లేక పోలేదు స్నేహితులకి కాలక్షేపం! అతనుమాత్రం తన అపూర్వాభిప్రాయాలను లోకంలో వదజల్లు తున్నానని ఆనందిస్తూంటాడు

ఆరోజున వచ్చిన స్నేహితుడు చర్చకి కూర్చున్నాడు "అయితే లోకంలో పరస్పరలాభంకంటె మరొక మాత్రమే లేదంటావు నువ్వు! చిత్రంగానే ఉందే!" అన్నాడు మిత్రుడు.

"ఇదిగో! దీనికి మొదటి ఉదాహరణచూడు. నువ్వు ఇంటికి రాగానే నీకు కాఫీ కప్పు అందించేనా లేదా? నాతోమాత్రమే పనుండిన వ్యక్తి ఒకడు ఇందాక వచ్చిపోయేడు."

"ఏమిటని?"

"గోరక్షణాలకి చందాలట!"

"ఏమి, చందా వేసేవా ఏమిటి?"

"వాడు మృతమయేది చందా ఇస్తానా! నా అసలు అంగీకరించుకుంటే, వాడికి కాఫీ నీళ్లు నే నెందుకు ఇయ్యలేదు అన్న ప్రశ్నకి నా సమాధానం చెప్పుతున్నా. వాడికి నాతోనే అవసరం కాని నాకు వాడితో అవసరం లేదు."

"ఆ మాట నిజమేలే!"

"ఇందువల్లే ఇచ్చి పుచ్చుకోవాలి; ఇదిగో మీ ఆవుకి గడ్డి అంటే, ఇదిగో మీ అబ్బాయికి పాలు, 'మీరు రైలెక్కండంటే, తమరు ముందర క్కండని మర్యాదలు, ఇదిగో మీ అమ్మాయికి పెళ్లికి రవికల గుడ్డ చదివించండి అంటే, ఇదిగో, మీ ఇంటిలో అన్న ప్రాశనకు వెండి చంచా అని బయలుదేరేయి. ఈ లోకంలో పరస్పరప్రయోజనం కంటె మరొకసుగుణ మున్నట్టు నాకంటికి కనబడ లేదు సుమా!"

"అయినా పోనిద్దూ! అంత ప్రయోజనవాదిగా ఉండకూడదు" అన్నాడు మిత్రుడు

"ఇదిగో ఇటాగు చూడు మనం ఆవులిని ఎందుకు పెంచుతాం? పాలు ఇస్తాయి కనక. వట్టి గొడ్డుకి గుప్పెడు గడ్డి వెయ్యడమను మానాం! కుక్కని ఎందుకు పెంచుతాం? ఇల్లుకాస్తుందని, కొత్తవాళ్లెవళ్లేనా వస్తే అరవనికుక్కకి ఒక్క కబళం వెయ్యమను చెప్తాను! మనం తోటలో ఎటువంటి మొక్కలిని పెంచుతాం? తిరిగి మనకి ప్రయోజన మున్నవాటిని మాత్రమే! కలుపుమొక్కలికి పుడి సెడు నీళ్లు పొయ్యమను! అట్లాగే తండ్రి కొడుకు నెందుకు సాకుతాడు? ముందెప్పుడో తనని ఉద్ధరిస్తాడని కాబట్టి పరస్పర లాభంకంటె మరొక మాత్రమే లేదంటే నమ్మ."

"అయితే ధనికుడైన తండ్రికి తిరిగి బిడ్డలవల్ల ఏమి లాభముంటుంది?" అని మిత్రుడు ప్రశ్నించేడు.

"లాభంలేదు, గీభంలేదు" అని చేతులు వెల్లికల పెట్టేడు సాగరం.

"మాతృప్రేమ, పుత్రప్రేమ అంటారు మరి అవేమిటి?"

"అవన్నీ తెలియనివాళ్లు చెప్పే అర్థంలేని మూర్ఖత్వం! ఉన్నదున్నట్లు చెప్పడానికి చిన్నతనం దేని కొరకి? పెద్దవాళ్లు పెడితేరు పాపం! తల్లి పాయసం అనడానికి సిగ్గుపడి పాలిగ్రామాలని, చేపలు అనడానికి మొహమాటపడి జలపుష్పాలని అనడం లేదుటోయ్!"

"బాగా చెప్పేవులే!"

అతనితో మిత్రుడు మరికొంతసేపు వాదించి వెళ్లిపోయేడు

మనుష్యుడు మనస్ఫూర్తిగా ఒక సిద్ధాంతాన్ని నమ్మకుండానే ఉండాలి కాని నమ్మితే మట్టుకు యథాశక్తిగా ఆచరిస్తాడు చింతాసాగరం తన సిద్ధాంతాన్ని అనుసరించి ఎప్పుడూ కాకికేనా చెయ్యివిదిపి ఎరగడు

అతను ఇలాటివాడయినాగే, అతని భార్య అలాటి గట్టు! ఆమె అతనితో తనకి చేతనయినంతవరకు వాదించింది కాని ఒప్పించలేకపోయింది అంతే కాదు, అతనితో సమానంగా వాదించలేకపోయింది ఆ అడమనిషి కాని ఆమె అతని సిద్ధాంతాన్ని ఎప్పుడూ నమ్మలేదు; తనకి నచ్చిన మార్గాన్ని ఎన్నడూ విడిచిపెట్టలేదు

అతని కొడుకు గజపతి పిత్రార్జితానికి హక్కుదారుడు బి. ఏ. పాసయేడు పెళ్లీడు వచ్చింది కొడుక్కి పెళ్లిచెయ్యాలి తప్పదు అన్నాడు తండ్రి. పెళ్లికోసం పిల్లలని వెతుకుతున్నారు సాగరం తన ఇల్లాలితో "పెళ్లి అయిన మర్నాటినుంచే కొడుకు, కోడలి కాపురం వేరు, మన కాపురం వేరు" అన్నాడు

అతని స్వభావం బాగా ఎరిగినది కాబట్టి ఆమె ఏమీ ఆశ్చర్యపోలేదు

"అత్త కోడలి తగవులాటలు మనకి వద్దు మనకి పోరువద్దు, పొందువద్దు" అన్నాడు భర్త

ఆమె ఇదివరకు దేనికీనా ఒప్పుకోలేకదా ఇప్పుడు దీనికి ఒప్పుకోడానికి! "మనం మనుషులము, మనమరాళ్ళను చూడకూడదా!" అని అడిగింది.

"దూరంనుంచి చూడడానికి ఎవ్వరికీ అభ్యంతరం ఉండదు!"

"ఇంటిలోవుంటే ముద్దుముచ్చట తీరుతుంది కాని చుట్టాలలానే చూసేరావడానికా!"

"అదంతా వ్యర్థమైన ఆలోచన!"

అతనితో వాదించి లాభం లేదని ఆమె ఊరుకొంది.

కొడుకు పూర్తిగా తండ్రి పద్ధతులలో పెరిగేడు. మంచి కట్నంతో కూడ పిల్ల రాగా, సాగరం కొడుక్కి పెళ్ళిచేసేడు. మూడు ముళ్లు పడ్డ రాత్రే చుట్టాలు, స్నేహితులు ఎవరి ఇంటికి వారు పోయేరు ఆ రోజు మర్నాటినుంచే సాగరం శాస్త్రప్రకారం కొడుకుకోడలి కాపరం వేరు, తను కాపరం వేరు కొడుకు ఆ సాయంత్రానికి గాని మరొక ఇంటికి మారలేదు గజపతి కొత్త ఇంటిలో ఇంకా చేరడో లేదో, చేతి కొక బిల్లు అందింది "నీవు పొద్దుటి నుంచి సాయంత్రం దాక మా ఇంటిలో మకాం చేసినందుకు అయిన చార్జి అయిదురూపాయలు. ఇది దాని తాలూకు బిల్లు" అని రాసి ఉంది తండ్రి పద్ధతులలో ఆరితేరినవాడు కాబట్టి గజపతి ఆశ్చర్యపోలేదు తండ్రికి డబ్బు చెల్లించి నగదురసీదు అందుకొన్నాడు

సాయంత్రమయింది. చింతాసాగరం కుర్చీ మీద కూర్చున్నాడు ఇల్లంతా బావురు మంటూన్నట్లుగా తోచింది. గోడలు కళావిహీనంగా కనబడ్డాయి.

చీకటి పడింది మామూలుగా కూర్చున్నచోటే దీపం లేకుండా కూర్చున్నాడు ఏమిటో గాబరా అనిపించింది "దీపం వెయ్యకపోడంవల్ల అయుంటుంది!" అని ఎలెక్ట్రిక్ దీపం వేశాడు దీపం మునపటిలాగు గాక మసక మసకగా ఉన్నట్లు తోచింది. "అంతా మునపటిలాగు లేదేమి?" అతని కనుపులో ఖాళీ ప్రవేశించింది. "ఏమిటా!" అని భయాశ్చర్యాలు పడుతున్నాడు "ఏమేనా వికారం ఆవేశించిందా?" అని ప్రశ్నించుకొన్నాడు

భార్య ఒక మూల చాప వేసుకు పడుకొంది. ఆమె మనస్సు మనస్సులో లేదు.

సాగరం తన అవస్థను ఆమెకు వర్ణించి చెప్పదలచుకొన్నాడు. కాని మాటల కేమీ అందేటట్లా కనబడలేదు తెల్లవారేక తన స్నేహితులకి చెప్పాలను కున్నాడు కాని వాళ్లు పకపక నవ్వుకొంటారేమో అని సిగ్గుపడ్డాడు.

చాగతీ అంతేనా! తప్పు తప్పు! మీరు అలాగు చెప్పకూడదు నేను అలాగు చెయ్యకూడదు." అన్నాడు. మిత్రులు నాశాకులై దయచేశారు.

అంతకు ముందు ఎప్పుడేనా చుట్టం చూపులకి వచ్చేగణపతి ఆనాటినుంచి ఆ రాకపోకలు కూడ కట్టిపెట్టేశాడు. "రేయకొన్న వాడిని రానేకూ, కొరివితో తలగోకుకొన్నానూ" అని సాగరం మరింత దుఃఖించేవు.

రోజులు గడిచిన కొద్దీ సాగరం స్థితి విషమిస్తూంది అతనికి పరిస్థితులను ఎదుర్కొనే చేవ ఉడిగింది "జీవితమే ఒటుకంటిది. ఈ బతుకే ఒక బాధ. దీనికంటె మరణం సుఖదాయకం" అని నిర్ధారించేడు అతని స్నేహితులు అతనికి అంత్యదశ సమీపించిందని భావించారు.

సాగరం తన సిద్ధాంతానికి ఎంతో పశ్చాత్తాపపడ్డాడు అది తనతో ముదముటితే బాగుండునని శోపత్రయపడ్డాడు చివరలో "నీవు నీబిడ్డలకి పెళ్లి చేసేటప్పుడు నాలాగువారికుటుంబాలకు దేయగా పెట్టి అవస్థలపాలు కావద్దు" అని ఆఖరిమాటలను చెప్పేడు

# కవితాంజలి



శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

వన్నెలు చిన్నెలున్ వయసువాసియు చక్కదనాల ప్రోవుగా
క్రొన్నన చెల్వులుల్లసిల కోమల భావ విలాసరేఖతో
చిన్ని మెఱుంగుతో సాగను ఒందిన తీయనిరేగు నూహగా
నన్నగ భావవీథికల సాగినయుగ్మలి కంజలించెదన్!
నడల హొరంగు చూపుల వణంగు కొడంగు తుఱంగలించదా
కడు విరబూసి సోయగముకాయ తురాయి వనందు కొమ్మనా
తడబడు నిల్పుతో వయసుదార్కొను మవ్వపు గువ్వగొంతుతో
చిడిముడి పాటుతో కదలు చిన్నది నామది చెంగలించెడున్!
అంచిత రాగరేఖ వికచాబ్జ పథమ్ముల సాగి వచ్చురా
యంచ విధాన నవ్రబపు టొయారములొల్క సొబంగు కోర్కెక
వ్వించి మెకందలో చిలుకరించిన జవ్వని చాయదేలి భా
వించు కళాపథాల చివురించి సుఖింపవొ కావ్యవల్లరుల్!
అలలితాంగి మోవి చివురాకు మెఱుంగు తురాయి కొటలన్
గ్రాలు వసంతు శ్రీరథ రథాంగము లల్లన గాడికొట్టగా
శీల మదీయ శైశిర వికీర్ణ హృదంతర వాటికాంతరం
బాలకు ఉల్లసిల్ల మణిహారముగా చివురింప వచ్చుటల్.
ఆ కలకంఠి కోమల కరాగ్ర రణన్నవకంకణ స్ఫురత్
శ్రీకమనీయ కాంతి తరళీకృత మాధు వికాంగ నారవ
ప్రాకట రాగవైభవ విరాజిత భాగ్యవినూత్న భాసురా
లోక నవప్రవాళ రుచులో మెదలో చివురుల్ రగిల్చెడున్
ఆ వరవర్ణినీ చలదపాంగ విలోల విలోకన ప్రభా
భావ పరీతరాగ పరిపాలిత మామక కావ్య మాలికల్
భావుక భావ్యమాన పరభాగ నమున్నవలకాంతి వీచికా
రావ వికాస శోభ మధురాధర లాలిత రక్తిసేలు జో!

రాజకవి, విశిష్టాద్వైతి పాండిత్యప్రాభవ్యవనుకంటి కాంతరసపోషాగ్రణులు కథను శృంగారప్రధానము గావించెనన్న ఇక్కడ కవులమాట చెప్పనేల? అతని కంటె ఘను డాచంట మల్లన్న యనిపించుకొన్నా డతని కొడుకు విజయరాఘవుడు. అతని కాలమున శృంగార మింకను విజృంభణలు చేసినది. శృంగార పదపూర్వకములగు క్షుద్రప్రబంధము లెన్నియో బయలుదేరినవి. కొందరు గ్రంథకర్తలు ఇతిహాస కథలను మహాపురుషుల చరిత్రల మాటుమాటులందు రంధ్రాన్వేషణ చేసిచేసి తమ శృంగార పిపాసను కొంత శాంతింపజేసికొనిరి. అట్టివారిలో అహల్యా సంక్రందనము, శశాంకవిజయము, పార్వతీపరిణయము మొదలగు గ్రంథములు రచించిన కవులు ముఖ్యులు. మఱియు బహుగ్రంథములందు గ్రామ్యశృంగారము నీచాతినీచముగా వర్ణింపబడినది. రఘునాథ కృతుల చూడింటను ఈ విషయము గలదు. దీని కొఱకు ప్రత్యేకముగా తంజాపురాన్నదానసత్రమను యక్షగాన మొకటి రచింపబడినది. దానినిబట్టి నాడు తంజావూరు సోమరిపోతుల సత్రములో తిండియేకాక చుండిన లావణ్యవతులు రూపాజీవులును వేశ్యలును యాకలిచ్చుకొనలేక తమ కంచిగరుడసేవాది పుణ్యములను ధారపోసెదమని వారిబంటపడుచుండెడివారని తెలియును.—ఈ యుగమున రాజులతో రంకుపోయిన కవయిత్రులుండుట ఇంకొక విశేషము. స్త్రీ సహజమైన సిగ్గునుగూడ విడనాడి గ్రంథములు రచించినారు. కాని స్త్రీకృతములగుటచే శృంగారము సైతము స్త్రీప్రకృతి చాలమట్టుకు తేటతెల్లము కాగలదు. ఈ యుగమున చెప్పుకోదగిన శృంగార కవు లిరువురు. క్షేత్రయ, చేమకూర. క్షేత్రయ మువ్వగోపాలపదములు భానుదత్తుని రసమంజరికి లక్ష్యకోశము. చేమకూర వారిది అపూర్వప్రబంధము. ఇందు ముగ్ధముగ్ధైన నాయికాశృంగారము ఉలూచి—నరాసక్తిని తలపింపజేయు ప్రగల్భ, కామేంగిత చిత్రాంగద ముగ్ధ, ఆమెది లోలిమాపురకలు సుభద్రసంగతి పూర్వరాగచేష్టితము రసధ్వని, రసోచితమైన అలంకారిక రీతియు నీతని విజయవిలాసకావ్య శృంగారగౌరవమునకు సోపానములు.

ఈయుగప్రబంధములన్నియు పూర్వకావ్యముల కనుకరణములే వానిలో శృంగారమునుగూర్చి ప్రత్యేకము చెప్పుకోదగిన గొప్ప యేమియు లేదు. ద్వ్యర్థికావ్యములందు కవికి శ్లేషకోసము కల్పము చేయుకొనుటలో సరిపోవును. శతకములు, స్థలపురాణములు ప్రాయికముగా భక్తిప్రధానములు. శానిపాటి త్రిపురాంతకుని అంబికాశతకము, రామలింగని పాండురంగమాహాత్మ్యములో పరకీయశృంగారముగల నిగమశర్మోపాఖ్యానము మున్నగు రెండు మూడిందుల కథవాదములు యక్షగానాదులందు ప్రక్రియ, రచనాప్రణాళికయు వేఱుగాని ఇక్కడ దంతయు ప్రాతప్రబంధధోరణియే.

ఇక ఆధునిక యుగమునకు దిగినంతనే కవియే నాయకుడు నాయిక ఊహాప్రేయసి లేదా ఏ పాడుగింటి కోయారో అయితే అవాచ్యపదేశముగో మర్యకవిత్వ మవతరించును మఱికొందరు బ్రతికి యున్నవాళ్లు భార్యను నానాబాధలు పెట్టి ఆమె చచ్చిపోతే పాముధూళితో కళకళ మొకటి వ్రాయుటయు ఆచారమై యున్నది. ఇట్లే నవయుగభావ కవిత్వమున శృంగారము ముఖ్యముగా నుండి పోయినది అసలా శృంగారము రసపర్యవసాయి కాజేరాదు

పై దరిత్రనుబట్టి చూచినచో శృంగార మాంధ్ర వాఙ్మయరంగమున ప్రధానభూమిక నిర్వహించినట్లు తెలియగలదు. ఏ వాఙ్మయమునను ఇంత శృంగార వ్యామోహము కవుల కున్నట్లు కనిపించదు. కవి త్రయమువారినుండి నేటివాని దాని పరిణామ క్రమము సతతోన్ముఖముగుచునే వచ్చినది. చివరికి కూచిమంచి జగ్గనిపోటిలో బూతుపాటల స్థితికి వచ్చిన దాంధ్రశృంగారము. రసికులను విసుగెత్తించినది. అందుచే కవు లిప్పుడిప్పుడు ఇతరరసముల కెగ బ్రాకుచున్నారు.

# కష్టజీవులు 

శ్రీ పేరుభొట్లు సూర్యనారాయణ

పర్వతముల జంటవలె నున్న యీ యెద్దు
నడచుచుండి కూలిపడుచునుండె,
ఎండుటాకులోని యీనెలవలె లోని
యెముకలెల్ల జూచి యెంచవచ్చు.

సంచివోలెనుండె చర్మంబు, ముడుతలై
గాజుబిళ్లలట్లు గండ్లు మెఱయు,
చావలేదుగాని కన్యావశిష్టమై
యూర్చుచుండె! బాధ నోర్చుచుండె!

మూపుపైన కాదు మోకాలిపై కూడ
కాయ కాచియున్న కష్టజీవు,
లెన్ని పుట్ల భూములిచ్చి పండించెనో!
పట్టిపోయె నాటి బలసమృద్ధి!

బడియ చేతబూని, యొడనెక బాదుచు,
తోకనిఱిచి, యెల్లదోలుచుండె!
కఱకుటెలుకవోలె కన్పట్టుచున్నాడు!
ఎచటి కివ్వి? వీని నేమి సేయు?

కొమ్ములుండికూడ గుమ్మగానోపవు
బుస్సుమనవు, యూర్పు పోసికొనుచు,
శాంతమేమి! వీని సౌజన్యమేమిరా!
యిట్టిచిత్తవృత్తి యెట్టులబ్బె!

లాంగలములు గట్టి, లాగించిబండ్లను,
వీని కష్టఫలము వినువ మెసవి—
క్రియమొనర్చు దుడుకు రెండుపుంజెలకు
పర్వతములవోలు వానియెద్దు

బలము దఱిగియున్న పశువుల రక్షింప
శాసనంబు లేవి? శాల లేవి?

ద్రవ్యమునకు నేడు దాసులైపోయిరి
రైతులార! ప్రేమ రహితులగుచు

పచ్చినీళ్ల కొఱకు సాధింపగా లేదు
పెట్టుగాక నీవు గొట్టుగాక
కండరములు నీదు కలిమికై కరిగించి
అసువులొండెయున్న పశువు లివ్వి

అడవులెల్ల దోటలయ్యె, నాదోటలు
పంటభూములయ్యె, బయలు లేవి?
తిరుగ జోటు లేదు తిన మేతయూ లేదు
పసరములకు నద్ది బ్రతుకు తెఱవు.

పేరు కనగ, చెఱకు పైరులు మెండయ్యె
ఆ పొగాకుతోట, లంతులేదు—
గింజపైరు కాదు కిట్టింపు—పశులకు
మేత లేదు—మనకు మెతుకు లేదు!

పశులమేతకనవు ప్రత్యేకముగ పెంచి
మేటివేయు కట్టుబాటు లేదు
వట్టిగడ్డి యెంత బలమైన మేత రా!
అదియునైన జాలినంత యేది?

పంజరములనుంచి పండ్లు గింజలు పెట్టి
పెంచుచుంటి వీవు పిట్టకదుపు
కష్టములకు నోర్చి కనిపెట్టుకొనియున్న
జీవులన్న నేల శీతకన్ను—

పొరపొచ్చలనుచు బడిచచ్చుచున్నాడు
మానవుండు బుద్ధిమంతు డౌట!
కరుణ చూపలేదు, ఘనకార్యమా యేమి?
ఈ కనీసధర్మ మెఱుగవలదా!

# అమరు కాంధ్రీకరణము

★

శ్రీ విఘ్నదవోలు వెంకటరావు

అమరుక మమర భావయందలి శృంగారరసోత్తర గ్రంథము. శృంగారరసమలిక యని శృంగార రసపేటికయని, శృంగార కంఠాభరణమని రసజ్ఞులు దీనిని గొనియాడెదరు ఇది కావ్యవిద్యాస్నాతకులకు క్రమభూషణము సంస్కృత హృదయులకు సంతతాహ్లాదకరము దీనిని శతకమని సంప్రదాయజ్ఞులు, లఘుకావ్యమని పాశ్చాత్య విమర్శకులు—ఖండకావ్యమని నవీనభావుకులు వ్యవహరింతురు

అమరుక మాదిశంకరులు రచియించిరని దైతిహ్యము అమరుకవి రచించియుండునని యాంతరంగిక ప్రమాణము కవి యెవ్వరైన నమరుకమాకృతి కర్త కమరత్వము సిద్ధింపజేసినది సుప్రసిద్ధ సంస్కృతాలంకారికులు, ఆనందవర్ధనుడు వామనుడు, నమరుకము నుదాహరించిరి కవితాప్రపంచమున శౌక ప్వాడు కాళిదాసుకన్న ఘనయశస్సు గాంచిన మయూరుడు తన సూర్యశతకమున నమరు శ్లోకచ్ఛాయల ననుసరించె ననుటచేత నమరుక కావ్యప్రఖ్యాతి విశదీకృతమగుచున్నది దాక్షిణాత్య సంస్కృతకవి స్తుతికెక్కిన 'అమరుకవి' క్రీ. శ. 6వ శతాబ్దికి ముందువాడనుట నిస్సంశయము.

అమరుకమందలి శృంగారము వర్ణనాప్రధానము గాదు ధ్వనిప్రధానము రచన యేకభావ మాత్రగ్రథితము గాక, బహుభావసమన్వితము కేవలాలంకారికకవి సమయముల ననుసరించి, కావ్యసృష్టిసేయక, నాయికానాయక రసభావసందర్భముల సన్నివేశముల రసోల్లసితమగురీతి వివిధ భావస్ఫురములుగా నొనర్చి, యమరుకవి శృంగార రసపోషణము గావించినాడు.

ఇందలి శృంగారము, మేఘసందేశ కావ్యాదుల యందలి శృంగారమువలె నేక భావగ్రథితము గాక, భాణములయందలి శృంగారమువలె, నసభ్యము గాక కుచశతకాదులయందలి శృంగారమువలె నువ్వాద రూపము వహింపక రసనిష్యందమై రసికజనాంతఃకరణ సంతతద్రవీకరణ కారణభూతమై వెలయుచున్నది

సంస్కృత భాషావాఙ్మయమున నమరుక మెట్టిదో ప్రాకృతభాషావాఙ్మయమున హాలుని గాథాసప్తశతి యట్టిది రెండును శృంగారరస ప్రాధాన్యములే రెండును, కేవల శృంగారరసముచే కావ్యరచన సాధ్యమని దారిచూపినవియే అయిన రస నిరూపణమున భిన్నపథకములైనవి దానియందలి శృంగారము, ప్రాకృతముగావున యమాయికపు పల్లెటూరి పడుచువంటిది రెండవది సంస్కృతము గావున నాగరకతయం దాతేరి, పలుపోకడ లెఱింగిన వెలఁబాణవంటిది ఒకటి ముగ్ధశృంగారము వేఱొకటి ప్రౌఢశృంగారము నిరూపించినవి.

## సంస్కృత వ్యాఖ్యలు

సంస్కృతమున నమరుకవ్యాఖ్య లిరువది మనకు లభ్యములగుచున్నవి 1

(1) రసికసంజీవని - అర్జునవర్మ
(2) అర్జునవర్మ – రసిక సంజీవని
(3) కవిచంద్రుడు
(4) కోకసంభవుడు
(5) గోష్ఠపురీంద్రసూరి
(6) చంద్రశంకాలాధరుడు
(7) దేవశంకరుడు
(8) నందలాలుడు - భావబోధిని
(9) నందికేశ్వరుడు

1. *New Catalogus Catalogorum by Dr V. Raghavan. Published by the University of Madras 1951 Page 251 to 253.*

(10) కోమటి జ్ఞానాకర కళాధర రవిచంద్రుడు ఇది శృంగార వైరాగ్యపరముగా రచితమైనది

(11) చతుర్భుజమిశ్రుడు భావచింతామణి
(12) శేషరామకృష్ణుడు
(13) రామరుద్రుడు
(14) రామానందనాథ పండితుడు
(15) విదగ్ధ చూడామణి
(16) విద్యాకరమిశ్ర
(17) వేమభూపాల శృంగారదీపిక
(18) వీరవల్లి శ్రీనివాసాచార్యులు
(19) సూర్యదాసు శృంగార తరంగిణి
(20) హరిప రభట్టు

ఇవి కాక, తంజావూరి రఘునాథ రాయల కాలమున (1614 1634) శృంగారసంజీవని యను సంస్కృతవ్యాఖ్య యున్నట్లును, నది రఘునాథరాయల కంకితము చేయబడినట్లును సైమన పరిశోధీయము (అముద్రితము)న నీ క్రింది విధముగ జెప్పియున్నది

“అమరుకాలంకార హారిభంగికల శృంగార
సంజీవనీ కౌముదుండు”

పై వానిలో విద్వన్మహాకవి శ్రీనాథుని కాక్రియదాత యగు పెదకోమటి వేమభూపాలుని వ్యాఖ్య శృంగారదీపిక మిగుల వ్యాప్తిలో నున్నది ఇది తెలుగు లిపిలో మాత్రమే ప్రకటితమైనది దేవనాగరి లిపిలో నింగ్లీషుభాషా వివరణముతో ప్రకటితమైన యీ వ్యాఖ్యానసార్వస్వమును రాష్ట్రేతర విద్వాంసులు గ్రహింపగలరు

## తెలుగు టీకలు

అమరుకమునకు తొలుత తెలుగు టీక తాత్పర్యము వ్రాసి ప్రకటించినవారు కీ శే వదలువాడ సీతారామశాస్త్రులవారు వారు దీనిని క్రీ శ 1865 సంవత్సరమున రచించి ప్రకటించిరి ఆ వెనుక చాల కాలమునకు కీ శే వేదము వేంకటరాయశాస్త్రిగారు సంస్కృతాంధ్ర వ్యాఖ్యలతో ప్రకటించియున్నారు

## కానుకొలను అన్నమరాజు

ఆంధ్రవాఙ్మయమున మనకు లభ్యములైన యమరుకాంధ్రీకరణములలో కానుకొలను అన్నమరాజుదే మొదటి కృతియని, చెప్పవచ్చును ఇది పూర్తిగ లభింపలేదు కాని యిందుండి ప్రబంధరత్నావళిలో నీక్రిందిపద్య ముదాహృతమై, యాంధ్రీకరణమున్నదని తెలుపుట కాధారమైనది

“చులుకన జాపమందికుచు చో
    గటకాముఖ పాణి యీవిధ జ
ల్లాలయనఖాంశులం గదిసి
    యొప్పెడు తెంజిగురాకు గుత్తిచే
నలవడి కర్ణపూరమున నంటిన
    తుమ్మెదబోని పార్వతీ
లలితకటాక్షదృష్టి మనలం
    జరితార్థుల జేయు గావుతన్

(ఇది యమరుక ప్రారంభశ్లోకము “జ్యాకృష్టిబద్ధ కటకాముఖ పాణి పృష్ఠ ప్రేంఖన్నఖాంశు చయ సంవలితో మృడాన్యాః, త్వాం పాతు మంజరిత పల్లవ కర్ణపూర లోభ భ్రమత్ భ్రమరవిభ్రమ భృత్కటాక్షః, అనుదాని తెలుగుచేత)

ఈ యన్నమరాజు క్రీ శ 1494 లో నున్నట్లు క్రింది శాసనములవలన దెలియవచ్చుచున్నది

---

* ప్రబంధ రత్నావళి బ్రహ్మశ్రీ యుత వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే సంపాదితము పుట 2 ఇందలి పద్యములు ప్రాచీనాంధ్రకృతులనుండి యుదయపుర సంధానకర్తలు (1918) కూర్చిన సంకలన గ్రంథములందలివి ఒకటి పెదపాటి జగ్గన ప్రబంధ రత్నాకరము ఇది యముద్రితము—మూడాశ్వాసములవఱకు తంజావూరి పుస్తకాగారమున సంఖ్య (189) గా లభ్యమగుచున్నది రెండవది ‘ఆంధ్ర సాహిత్యపరిషత్తు’న సుధాహార గ్రంథమని పేర్కొనబడిన సంకలనము దీని కర్త పేరు తెలియలేదు ఇది యముద్రితమే ఈ రెండింటియందలి యపూర్వములైన కృతులను పద్యములను సంగ్రహించి విలువ గల పీఠికతో నలంకరించి, గ్రంథరూపమున వెలువరించిన కీ శే ప్రభాకరశాస్త్రిపాదులకు ఆంధ్రవిద్యాలోక మెంతయేని కృతజ్ఞత చూపవలసియున్నది దీనికి కొంత సంస్కారము జరిపి పునర్ముద్రితము కావలసియున్నది

శ్రీగణాధిపతయే నమః శ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు 1616 అగునేంటి ఆనందనం వత్సర శ్రావణ బ 10 రోహిణీనక్షత్ర కు(లాల)గ్నమందు యజనయాజనాధ్యయన, అధ్యాపన దాన ప్రతిగ్రహ షట్కర్మనిరతులయిన యజుశ్శాఖ, అంగీరస బార్హస్పత్య, భారద్వాజ(జ)సగోత్రులైన కామంగోలని మూరపరాజు అన్నయ్యగారుకు అన్నయ్య(కు) శ్రీ తుంగభద్రాతీరం భాస్కర క్షేత్రమందుల శ్రీపంపా విరూపాక్ష దేవుండు ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధి అనువట్టాగాను ఆచంద్రార్కతం రక్షిం(చు)ను మంగళయ్యిన్ శ్రీ శ్రీ శ్రీయున్

ఈశాసనము హంపీమహాక్షేత్రమున నైన బస్తియాలయమున కెదురుగనున్న రాతిపైనున్నది ‡ ఇందు పేర్కొనబడిన అన్నయ్యయే, అన్నమరాజు కాదగును. ఈతని తాత మూరపరాజు నామమిది విషయము తెలుపుచున్నది మఱియు ఇతడు ఆపస్తంబసూత్రుడనియు భారద్వాజసగోత్రుడనియు, హంపీక్షేత్రవాసియనియు, దెలియుచున్నది. కామంగోలనే, 'కామకోలను' అయినది

ఈ యన్నమయ్య కృతినుండి పెలుగొకసీసపద్యము కూడ ప్రబంధరత్నావళిలో నుదాహృతమైనది. అది త్రిపురాంతక దేవునిగూర్చిన దైవస్తుతి ఆ పద్యము నిందుదహరించుచున్నాను.

"త్రిపురారాతికి చక్కి తిరుగు చక్రంబులు
మెట్టుల బదిలమై మెఱయ తేరు
బహుముఖంబుల చేర్పుపచరించు సారథి
ప్రాపించూపగ రానివారువములు
గట్టిరై శిరసక్కనదీర్చు విల్లుగమ్మ
ప్రసిద్ధింబుగ ప్రోతమాపునారి
విజయానుకూలమై విలసిల్లు బాణంబు
సరిలేనికోటుల సంభ్రమలము
తనకు నబ్బుటయును బురత్రయము గెలిచి
పృథులవిఖ్యాతి గైకొన్న రథికవరుడు
జయము లీలంబు భూతియు ప్రియమెలర్ప
మనల గరుణావిధేయుడై మనుచుగాత.

## 2. తాళ్లపాక తిరువేంగళప్ప

అన్నమరాజు కృతి తరువాత పేర్కొనదగినది తాళ్ళపాక తిరువేంగళప్ప యాంధ్రీకరణము. ఈ యాంధ్రీకరణ మముద్రితము. గ్రంథము చివర కావిట్లు చెప్పకొనియున్నాడు

"ఇల దాళ్ళపాక నన్నూల
తిలకుడు, శ్రీ వేంకటేశ దీక్షిత సుతు డు
జ్జ్వల కవితానిధి తిరువేం
గళప్ప యమరుకను తెలుగుగా రచియించెన్ "

తిరుపతి క్షేత్రమున సంకీర్తనాచార్యులై ప్రఖ్యాతి జెందిన తాళ్ళపాకవారి వంశీయుడగు నీ తిరువేంగళప్ప క్రీ. శ. 1600 ప్రాంతమున నున్నవాడు. ఈ గ్రంథమును తిరుపతి వేంకటేశ్వరునికి కృతి నొసగియున్నాడు. ఈ యమరు కాంధ్రీకరణము సంపూర్ణముగ నున్నది. చాలవఱకు చంపకములు, ఉత్పలములు వాడుకయైనవి. తక్కువగా మత్తేభ శార్దూలములు, కందములు వాడబడినవి. కేవల శృంగార రస ప్రధానమగు నిట్టి కావ్యమున, వీరరసానుగుణ్యములగు మత్తేభ శార్దూల వృత్తముల వాడిక సరసముగా నుండదను తలంపున నీతడు వానిని విడిచియుండ వచ్చును. అముద్రితము గాన దీనినుండి కొన్ని పద్యముల నుదాహరింతును. మూలమున ప్రతి పద్యమునకు ముందు వ్యాఖ్యానోరిక భావములో చిన్న వివరణము వచన రూపమున నున్నది

"శ్రీరుచిరాంగ నాత్రమవిచిత్ర
విభూషణభూష చందనో
దార విలాసదీపితములై, యసి
తోత్పల కాంతి మించి, శృం
గారరసంబు దోచునవ గన్నుల
పండువులైన పేరి యా
యాశ్చర్యములాగు వేంకటనగాధిపు
డీపుత మాకు గోరికల్ "

"వచనము— శృంగారరసప్రధాన మమరుక కావ్యము. శృంగారము - సంభోగము, విప్రలంభము అని రెండు విధములు అందులో సంభోగ శృంగారం

‡ దక్షిణ హిందూదేశ శాసన సంపుటములు. 9 సంపుటము. No. 271 పు. 60 పుట హంపీక్షేత్ర శాసనములు.

మొదలుగా ఉపశ్లోకించి శృంగార రసావళి అలంబన విభావమైన నాయికాసౌందర్యరూపమును చే దేవతగా భావించి, తృతీయ పురుషార్థమును కూర్చి, ఆశీర్వదించినాడు."

"చెదరి చలించు ముంగురులు,
స్వేదకణంబుల వింతశోభ బొ
ట్టొదవుర కాంత కాంతి మెఱయ
సొయ్యన పోలెదు కమ్మ దామరల్
కదలెడు కుండలంబులును
గల్గిన హాసవిభాసమానయై
ముదిత ముఖారవింద మతి
మోదము మీకు నొసంగు గావుతన్."

(ఇది 'అలోలామలకౌతవిం' అను శ్లోకమునకు తెలుగుచేత మూల శ్లోకములోని చివర పాదమున 'ప శ్వ్యాం పాతు చిరాయ కిం హరిహర బ్రహ్మాదిభిర్దేవతైః' అను భావము పై పద్యములో ననువదింపబడ లేదు )

"దెలుపుదు వచ్చువేళ సరసీరుహ
లోచన, మంగళార్థమై
కలశల గాదు తోరణము గట్టుట,
వాలిక చూపుదంశ కే;
యలరుల గాదు మించు టుపహారము,
నవ్వుల గాని, యర్ఘ్యముల్
కలశగతాంబుపూరమున గాదు
చెమర్చును లోచనాళిచే "

"క్రొంక్కగ వచ్చు నాతి దటము
గని యంత్రములు మూయు కోకచే
పక్కన నవ్వు దాశోక గెపంబున
గప్పు; ప్రియోక్తులాడుచు
దిక్కటు చూడకే చెలుల దిక్కయి
ముచ్చటలాడుచుండు నీ
చక్కరబొమ్మ ప్రేమ కడుచక్కన
పోలాలయల్క నెచ్చెలీ!"

"యామవరపార్శ్రియున్ కిసలయారుణ
కోమలమున్ విశాల్మ
రత్నాకర నూపురంబును,
మదాలసభారము సొవదంబుచే
తేరవభూరుహుండు ప్రమదోద్భక్తి
బరాంగనచే కాడితం
డైవిలసిల్లు నాడు పసుపూరయుత
దేశపదం బ్రియించుగాక."

ఇది "పాలశ్రీకేశవపల్లవ కోమలేతి" అను శ్లోకమునకు తెలుగు.

గ్రంథసూచి.

1. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార వివరణ-(1911-12-18) R 107–K–4-25.

2 కవికళపులచరిత్ర పుట 184–185 1934 (వంగూరు సుబ్బారావు)

3. తిరుపతి దేవస్థానమువారి యార్షశాఖా విశేదిక. 800 పుట.

4 ప్రాచీనాంధ్ర క వు లు తాళ్లపాకవారు. భారతి, ధాత–మార్గశిరము

5. శిష్టు సర్వశాస్త్రి యమురక కావ్యటీక పుటలు—8 4 (1937) 841-842 పుట

తాళ్లపాక తిరువేంగళప్ప కృతి నిరుకవతుబాతివ వాఙ్మయమున నమరు కొంధ్రీకరణములు విశేషముగ గనపట్టుచున్నవి వీనిలో తొలికృతి యాంధ్రీకర్త

## 1 శిష్టు సర్వశాస్త్రి (1830-1860)

శిష్టు సర్వశాస్త్రి, మహోద్దండకవి పండితుడు, సంగీత సాహిత్య విద్యానిధి శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి కొమారుడు క్రీ శ 1860 సంవత్సరమున నమురుకమును రచించి, తన ఆశ్రయుడును శ్రీకాకుళ ప్రభువును నగు దామెర వేంకటపతి రాయనింగారికి కృతినిచ్చెను. ఈతడు విద్వత్ప్రభువు సుప్రసిద్ధ పండితకవి మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులవారికి 'విద్వత్కవీశ్వర' బిరుదమునిచ్చి సత్కరించిన దీ ప్రభువే—ఈతడు క్రీ.శ 1819—1881 మధ్య జీవించియుండెను. కృతికర్త సర్వశాస్త్రి యమురుకమే కాక, జ్ఞానప్రసూనాంబికాశతకము, లలితాంబాస్తుతి, అచ్చిగాని శారావళి, చాటువులు మున్నగునవి రచించి కొంతకాలము రాయవేలూరు దొరతనమువారు స్థాపించిన పాఠశాలలో సంస్కృతోపాధ్యాయుడై తరువాత

కాళహస్తి సంస్థానకవియైన శ్రీ త్రిపురసుందరమ్మగారు. ఈతని యమరుకము 1937 లో ముద్రితమై ప్రకటితమైనది. ఇది సంపూర్ణానువాదము (గ్రంథసూచి)

1. వీరేశలింగముగారి యాంధ్రకవులచరిత్ర — తృతీయభాగము పుట 199. శిష్ట కృష్ణమూర్తికవి చరిత్రము.

2 జ్ఞానప్రసూనాంబికాశతక టీక — జ రామయ్య — ఆంధ్ర సాహిత్యపరిషత్ప్రచురణము — 1916.

3. ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార సూచిక — (1917—18) పుట సం. 299.

## 2. మండపాక పార్వతీశ్వరశాస్త్రి (1833 - 1897)

అభినవాంధ్రకవితా పితామహుడనియు, అనర్గళకవనధారాపారీణుడనియు వాసిగన్న పార్వతీశ్వరశాస్త్రిగారు దీనిని క్రీ శ 1868 లో నాంధ్రీకరించి 1893 లో ముద్రించిరి ఇది రెండు మూడు పర్యాయములు ముద్రణభాగ్యము నందినది ఇందలి పద్యములు వెంకటగిరి సంస్థానమువారు ప్రకటించిన శృంగార పద్యావళి యను సంకలనగ్రంథమున నుదాహృతములైనవి. మఱియు, శ్రీ శ్రీ వల్లాల సదాశివశాస్త్రి, శేషశాస్త్రిగారును క్రీ శ 1901 లో ప్రకటించిన వరసనూపాలీయ రసప్రకరణ నాయికానాయకప్రకరణవ్యాఖ్యయం దిందలి పద్యములు లక్ష్యములుగా గైకొనబడినవి. దీనినిబట్టి యీ యాంధ్రీకరణమున కెంత వ్యాప్తియున్నదో తెలియగలదు. ఇందలి

"శ్రీ కటకాముఖం బనెడుచేత
గొనంబు గొనం బయిం బయిం
బ్రాకు పశుప్రభంగలయ పర్వుచు,
మంజరిత ప్రవాళభం
జాకృతి కర్ణభూషణ సమాదర
చంచల చంచరీకలీ
లాకరమై తనర్చు జగదంబ
కటాక్షము మిమ్ము బ్రోచుతన్."

"గృహతోరణంబు వికిన్ కధూకర
రత్నదీపోజ్జ్వలాలించి తా
నహానాటిక్ సురసన్నిధిన్
నదుకగా సత్కాంతిశోభాన్వితా
మహిళారత్నము కర్పూరవిధి
సత్కాంతిక్రమున్ వాడి మా
కుకానన్ చందురుటంబున మ్మ
లిపి గైకోచేసె వాగ్బంధమున్"

మొదలగు పద్యములు ప్రాచీన పండితులకు పరిచితములే. దీనినిగూర్చి "కళ్యాణి సంక్రాంతి సంచిక" (1984) లో వారి మనుమలు శ్రీ శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు (1888 - 1940) వ్రాసిన వ్యాసము చదువదగినది.

## 3. వారణాసి అచ్యుతరామకవి (క్రీ శ. 1820 - 1890)

కలియుగ దానకర్ణుడని ప్రఖ్యాతి గాంచిన జయంతి కామేశము పంతులుగారి (1841 - 1884) యాజ్ఞ ననుసరించి, వారి యాస్థానకవి అచ్యుతరామకవి యమరుకమును క్రీ శ 1870 ప్రాంతమున తెనిగించెను ఇందన్నియు సీసపద్యములే వీనిలో నెనుబది రెండింటి పద్యములు చెన్నపురి ప్రభుత్వమువారి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున గలవు. అందలి నివేదికలో యత్కృతప్రకటనా తెలుపబడియుండలేదు. అచ్యుతరామకవి కామేశము పంతులుగారి కృతి నొసగిన 'శ్రీకృష్ణకథాసుధారసము' అను ప్రబంధమున, తానీ యమరుకమును సీసపద్యములలో రచించినట్లు తెలిపినాడు (చూడుడు శ్రీకృష్ణకథాసుధారసము - అవతారిక) ఈ ప్రబంధము ముద్రితమైనది

## 4. సాధుపల్లి చంద్రశేఖరశాస్త్రి 1890 ప్రాంతము

ఈతడు వెంకటగిరి వాస్తవ్యుడు. సంస్కృత కర్ణాటాంధ్రభాషలలో గవి శ్రీ సచ్చిదానంద నృసింహభారతీస్వామిశిష్యుడు దేవ్యుపాసకుడు. మనుచరిత్రమును కన్నడమున వ్రాసినాడు ఈతని యాంధ్రీకరణమున చంపకోత్పల శార్దూల మత్తేభవృత్తము లొక్కొక్కదాని నైదారు పాదములు గలవు. ఈ యాంధ్రీకరణము 1898 లో వేమభూపాల సంస్కృతవ్యాఖ్యతో గూడ వెంకటగిరిలో ముద్రితమైనది.

### 5 జయంతి రామయ్య. (1861-1941)ం

గ్రాంథికవాదాగ్రేసరులు, రామయపంతులు గారు, అమరుకమును క్రీ శ 1902 ప్రాంతముల నాంధ్రీకరించి, అప్పటి రాజకీయోద్యోగ నిర్బంధముచే ముద్రింపక, క్రీ శ 1932 లో పలువురు విద్వత్ప్రభువులు ప్రోత్సహింప ముద్రించిరి ఇది మూలముతోఁగూడ, సరసమైన యాంధ్రీకరణముతో ముద్రితమైనది

### 6. వట్టిపల్లి నరకంఠీరవశాస్త్రి

ఈతను తిరుపతి సంస్కృత కళాశాలయందు సాహిత్యాచార్యుడు ఇటీవల కీర్తిశేషుడు ఈతని యమరుకమున పద్యములు భారతిలో ప్రకటితములైనవి

### 7. చెఱుకూరి కాశీవిశ్వేశ్వర శర్మ

సులభశైలితో రచితమైన యీ యమరు కాంధ్రీకరణము 1931 లో 'సమదర్శిని' సంవత్సరాది సంచికలో ప్రకటితమైనది.

### 8. మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రి

విశాఖమండలమున పాలకొండ వాస్తవ్యులగు మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రియను కవి దీనిని చక్కగ భాషాంతరీకరించియున్నాడు ఇది ముద్రితమయ్యు ప్రకటితము కాలేదు

### 9 గుఱ్ఱము సుబ్రహ్మణ్యము
### ఎమ్. ఏ. బి యల్

వీరి యమరుకాంధ్రీకరణము క్రీ శ 1938 లో ప్రకటితమైనది. శ్రీయుత కొటూరి వెంకటేశ్వర రావుగారి టీకతోఁగూడ వెలయుచున్నది తెనిగింపు సమీచీనముగ నున్నది.

### 10 వింజమూరి శివరామారాయకవి

### 11. పెనుమర్తి వేంకటేశ్వరశాస్త్రి

### 12. ఘట్టిలక్ష్మీనరసింహశాస్త్రి

వీరు మువ్వురు నీ తరువాత నమరుకము నాంధ్రీకరించిరి ఈ యాంధ్రీకరణముపై విమర్శకాభిప్రాయమిది 1 శివరామంగారి రచన ద్రాక్షాపాకము

2 పెనుమర్తివారి రచన కదళీపాకము.

3. ఘట్టివారి రచన నారికేళపాకము.

(భారతి 30 సం 7 సం 98 పుట 1948 జూలై) ఘట్టివారు నేను తమ రచనమును పునర్ముద్రణముచేసి యున్నారు అది భారతిలో విమర్శింపబడినది

వీరుగాక శ్రీ వండూరి శివరావుగారును, కీ శే. మారేపల్లి రామచంద్రశాస్త్రిగారును దీనిని తెనిగించిరట ఇంకను నాగరేచుణకందని యనువాదములుండవచ్చును నాకు దెలిసిన దేర్చెదను

సంస్కృత గ్రంథానువాదముల చరిత్ర తెలుసుకొనుటకేమి, ఏక కావ్యవస్తువు గ్రహించిన కవులను గూర్చి సమగ్రముగను, సప్రమాణముగను పరిశీలన చేయుటకేమి, ఆయా గ్రంథసూచికలు ముద్రితాముద్రిత వివరణముతో గూడ నే దత్యంతావశ్యకమై యున్నది అట్టి యాంధ్రగ్రంథసూచికా సర్వస్వ రచనను ప్రోత్సహించుటకే వ్యాసముద్దేశింపబడినది



# వియోగాగ్ని

★

'మధుశ్రీ'

ఊహాకలితమైనది, మహోన్నతమైనది, దివ్యశక్తి సం
దోహములోఁ గూడినది, దుఃఖము లేనిది, భీతిగాని, సం
దేహముగాని చేరనిది, తృప్తికరమ్మయి సర్వలోక స
మ్మోహనమైన యట్టిదియుపో! ప్రణయ—మ్మది యెంత గొప్పదో!

చెలి! నీనా ప్రణయామృతాంబునిధి వీచీమాలికా డోలికా
వళి నిన్నున్ మఱి నన్ను నేఁడొయొక స్వప్నభ్రాంతిగా మేఘ వీ
థులపై దేవవధూ రహస్స్థలులయందున్, త్రిప్పి, నానాఁటి వే
ళల యందెద్దొయొకప్డు—స్వర్ణసుమముల్ ప్రాలెన్ శిరోజాగ్రమ్ములన్.

అంతియ! దానితోసరి! మహావిష దంష్ట్రిలఁ బోలు తత్స్మృతుల్
స్వాంతమునందునన్ నిలిచి శాశ్వతదైన్య విషాద వహ్ని సం
క్రాంతిగఁ జేయుచున్నవి—సుఖమ్మెటువంటిదొ యేనెఱుంగఁ గ
ళ్లాంత విలోచనా! కనికరమ్మును జూపెడివార లేరుపో!

నీవొక దేవకన్యకవు! నేనొక రాక్షసమూర్తినేమొ? దే
వీ! వరమిచ్చి మెచ్చితివి, విభ్రమచిత్తుడనై ప్రమోదరే
ఖావధి దాఁటులోపలనె కన్నులు విప్పితిఁగాని నిన్ను బా
ష్పావృత దృష్టియుక్త నయనాంచలసీమలయందుఁ గంటినా?

ఒకఁడెవఁడో మహోజ్జ్వల మహోన్నత సత్కవిరాజు వానినా
టకమున సృష్టిచేసిన రటన్నటివౌదువు నీవు, కాని—మా
యకు వశమైన లోకములయందెటనైనను నిన్నుఁబోలు నా
యిక జనియించెనా? హృదయమందలి భ్రాంతులు వోల్పఁ గ్రాంతులై!

ఇది వియోగాగ్ని! —దీని నీవే యొసంగి
నావు—నీ బహుమాకృతి శిరసా వహింతుఁ;
గాని, వన్నెల విసనకఱ్ఱా! 'వసున్' మ
తెంత కాల మహర్నిశ లేద్వు మనదు?

# కలగూరగంప

## శృంగార రసమంజరి

వికృతి భాద్రపద శుద్ధములో ఆంధ్రగానకళా పరిషత్తు (రాజమహేంద్రవరము)వారిచే ప్రచురింపబడిన క్షేత్రయ్య పదములను గ్రంథములో అనుబంధముగా 'శృంగార రసమంజరి' ప్రకటింపబడినది. నా సంపాదకత్వమున వ్రాయబడిన "తొలిపలుకులో" (పుటలు 63 - 68) 'క్షేత్రయ్య పదములు - అలంకార శాస్త్రము' అను శీర్షిక క్రింద నాటికి నాకు లభ్యమైన విషయము ననుసరించి ఇట్లు వ్రాసితిని "ఈ వివరణకు 'శృంగార రసమంజరి' యని పేరు దీని కర్త యవరో తెలియదు ఆంధ్రసారస్వతములో క్షేత్రయ్యపదముల స్థానమును, విలువను నిర్ణయించుచు ఈ గ్రంథకర్త చేసిన సేవ చిరస్మరణీయము" ఈ వివరణయంతకు కర్త యొక్కరే యను యుద్దేశముతో అట్లు వ్రాసితిని కాని సుమారు నాలు రోజుల క్రిందట ఈ వివరణయొక్క కర్త లిద్దరని స్పష్టమైనది ఈ విషయమును క్లుప్తపరచుచున్నాను

కొలదినముల క్రిందట విజయనగరము వెళ్ళియుంటిని అప్పటి మహారాజావారి సంగీత కళాశాలలోని శ్రీ దువ్వూరి జగన్నాథశర్మగారిని—నాట్యాచార్యులను— కలసితిని ప్రసంగసందర్భములో వారు, శృంగార రసమంజరీ కర్త, గుడిపాటి కోదండపతి యని, వారి గ్రంథము 1901 లో అచ్చైనదని, అది వారివద్ద కలదని చెప్పి నా కది దయతో ఇచ్చిరి ఈ విషయము శ్రీ వీరేశలింగము పంతులు గారు వారి ఆంధ్రకవుల చరిత్రలో మూడవ భాగములో వ్రాసియున్నారనికూడ వారు సెలవిచ్చిరి ఈ విషయము వారు నాకు తెలియజెప్పినందుల కెంతయు కృతజ్ఞుడను.

అందుపైని రాజమహేంద్రవరములోని శ్రీ గౌతమీ గ్రంథాలయమునకు జని అచ్చట యీ విషయమై కనుగొనగా, 1901 లో అచ్చైన శృంగార రసమంజరియే గాక, 1872 లో అచ్చైన 'సంస్కృతాంధ్ర రసమంజరి'కూడ లభ్యమైనది. ఇది వింజమూరి కృష్ణమాచార్యులవారి చేతను వ సీతారామాచార్యులవారిచేతను పరిష్కరింపబడి, వింజమూరి కృష్ణమాచార్యులవారిచే రచింపబడిన మకరంద మనెడి వ్యాఖ్యానముతోడ, ఊ. పురుష రథ సెట్టిగారిచే చెన్నపురిలోని స్వకీయ కళారత్నాకర ముద్రాక్షరశాలయందు ముద్రించి ప్రకటింపబడియెను ఇందు భానుదత్త కవికృత సంస్కృత రసమంజరి మూలములోని ఒక్కొక్క శ్లోకమునకు ప్రతిపదార్థము వ్యాఖ్యానము (మకరందనామవ్యాఖ్యానము)తరువాత గుడిపాటికోదండపతికవిచే ఆంధ్రీకరింపబడిన వచనము, పద్యము వరుసగా ఇయ్యబడినవి ఇందలి ఆంధ్రభాగము మాత్రమే 1901 లో అచ్చువేసిరి దాని వివరణ యిట్లు "సురతాని కోదండపతి కవివరప్రణీతంబైన శృంగారరసమంజరి— ఇయ్యది పండితులచే బరిష్కరింపబడి వంకాయల కృష్ణస్వామిశెట్టివారి స్వకీయ శ్రీరంగవిలాస ముద్రాక్షరశాలయందు ముద్రించి ప్రచురింపబడియె చెన్నపట్టణం—1901 గినివెల అ ౨" ఈ తెలుగు రసమంజరికిని పైన చెప్పిన 1872 లో ముద్రితమైన దానిలోని తెలుగు అనువాదమునకును అచ్చటచ్చట కొద్దిపాటి భేదములు కలవు కాని సముదాయముమీద ఒకటే గ్రంథము. 1872 లో అచ్చైనదే శుద్ధముగా యున్నదని చెప్పవలసియున్నది ఇదివరలో నాకు లభ్యమైన భానుదత్తుని సంస్కృత రసమంజరి, నాగర లిపిలో ముద్రితమైనది. అందు అనంతభట్టుచే రచింపబడిన వ్యంగ్యార్థ కౌముదియను వ్యాఖ్యానము కలదు. తెలుగులిపిలో ముద్రించిన ఈ సంస్కృతాంధ్ర రసమంజరిలో అనంతభట్టు వ్యాఖ్యానములేదు.

గుడిపాటి కోదండపతి నందవరీకనియోగి బ్రాహ్మణుడు. ఆశ్వలాయన సూత్రుడు, భారద్వాజ

గోత్రుడు, సురతాని బిరుదాంకితుడగు వేంకటమంత్రి పౌత్రుడు, రంగయామాత్యునకు పీరమాంబకును పుత్రుడు. ఇతడు మూడుగుచ్ఛములుగా వెలిగించిన శృంగార రసమంజరిలోని తృతీయగుచ్ఛము చివరను గల గద్య ఇట్లున్నది

"ఇది శ్రీమత్కోదండరామ వరప్రసాదలబ్ధ చతుర్విధ కవితాధురీణ భారద్వాజగోత్ర పవిత్ర, వేంకటమంత్రిపౌత్ర, రంగయామాత్య పుత్ర, సత్కవిజనమిత్ర, సకలకళాకలిత్ర, గుడిపాటి వంశ పయఃపారావార రాకాసుధాకర, సురతాణికోదండపతి ప్రణీతంబైన శృంగారరసమంజరియందు, చత్వారింశ త్పద్యదళంబులుం చతుర్దశ వచనకేసరంబులుం గల కుసుమపంచకంబుచే నొప్పారు తృతీయగుచ్ఛము"

మరియు నీ గ్రంథాంతమున నివ్వబడిన రెండు పద్యముల నుదహరించుచున్నాను

"శ్రీరంగనాయకీ నత
నీరజముఖుపాదములను నే బూజింతున్
శ్రీరంజిలు రసమంజరి
మారిస్తుతి పారిజాత సుమమంజరిగన్"

"శ్రీకరనందవరీకాగ్రగణ్యుండు మహిమీఱు
గుడిపాటి వంశభవుడు
బిరుదుగా వరభంప సురతాణి పేరంది
మహితుడౌ వేంకటమంత్రి పౌత్రు
డతులితుడౌ రంగయామాత్యు తనయుండు
పీరమాంబానంద వృద్ధికరుడు
వెంగన్న వెంగళ శ్రీనిధులనుజుడై
భాసిల్లు కోదండపతి ఘనుండు
సరస కవితా చమత్కార సార్వభౌము
డనఘ శ్రీరంగధామ దయాశ్రయుండు
వెలయ రసమంజరిని రచియించెనందు
సరవిగా తృతీయగుచ్ఛంబు దనరు.

ఇతడు 'శ్రీరంగనాథ దయాశ్రయుండు' నని 'శ్రీరంగేశ్వరి రంగనాయకిని సేవింతు చెల్లప్ప' దని కృత్యాదియందు శ్రీరంగనాథుని శ్రీరంగనాయకిని స్తుతించుచు పద్యములు వ్రాయుటచేతను శ్రీరంగ ప్రాంతములయం దితడుండెనేమో యని చెప్పవచ్చును. కృత్యాది పద్యములలో నివి కొన్ని.

"శ్రీరంగనాయికా ముఖ
సారంగమదార్ద్ర పత్రభంగయశాసన, శే
షాయితభుజాంతరుడగు
శ్రీరంగేశ్వరు డభీష్టసిద్ధు లొసంగున్"

"నందవరకంశ జలధిపూర్ణేందులీల
రసికుడసువట్టి సురతాణిరంగ ఘనుని
సుతుడు కోదండపతికృతి ప్రమితియొనర్చ
మంజురసపుంజ శృంగారమంజరిగను"
"మధుర మాధ్వీక భణితిగా మధువితీర్ణ
వాసనావాక్య సౌరభ్యవాసరసిక
మధుకరానందకర రసమంజరియును
దనరు కవిరాజకర్ణావతంస మగుచు"

ఇత డే కాలమువాడో తెలియదు "ఇన్నూఱు సంవత్సరముల క్రిందట నుండియుండు నేమో" యని శ్రీ వీరేశలింగము పంతులుగా రభిప్రాయపడియున్నారు

క్షేత్రయ్య పదములతో అచ్చువేసిన శృంగార రసమంజరికిని దీనికిని కొన్ని ముఖ్యములగు భేదములు కలవు. క్షేత్రయ్య పదములతో అచ్చువేసిన దానిలో రెండు భాగము లున్నవి. పుటలు 219 – 237 లలోని వచనములో నియ్యబడిన నాయికాది లక్షణమంతయు కోదండపతి శృంగార రసమంజరిలోని వచనభాగమే. తరువాతి 238 – 258 పుటలలోని "(క్షేత్రయ్య పదములనుండి లక్ష్యములు – సమన్వయము)" అను శీర్షిక క్రింద అచ్చైనదంతయు చాలవరకు కోదండపతి కృతిలోనిదే యని చెప్పవలెను. మొదటి రెండు పుటలలోని మూడు పద్యము లా కవి వ్రాసినవే. భానుదత్తుని రసమంజరిలో లక్షణము – వచనము, శ్లోకములలోను లక్ష్యము శ్లోకరూపమునను ఇవ్వబడినవి. కోదండపతి, శృంగార రసమంజరియందు లక్షణమును వచనమున తెలుగులో వ్రాసి, లక్ష్యములను పద్యములలో వ్రాసెను. క్షేత్రయ్య పదములతో ముద్రితమైన శృంగార రసమంజరిని రెండు భాగములుగా నెవరో క్రమము తీసికొని, వ్రాసిరి. నాయికాది లక్షణములకు లక్ష్యములుగా వ్రాయబడిన పద్యములను వదలి ఎక్కువగా క్షేత్రయ్య పదములనుండి లక్ష్యములను చూపియున్నారు. సురతాని కోదండపతి క్షేత్రయ్య పదములగురించి ఏమియును వ్రాయలేదు. అందుచేత

ఈ విధముగా శృంగార రసమంజరిని విడదీసి వచన భాగమును—(లక్షణముల నిచ్చిన భాగమును)—మాత్రము మొదట వ్రాసి లక్ష్యములక్రింద సుప్రసిద్ధ వదకర్తల పదములను చేర్చి రెండవ భాగముగా విడదీసిన వారెవరో ఇంకను స్పష్టపడలేదు

మరియు రెండవ భాగమున నీ యజ్ఞాత సంపాదకుడు, లక్షణములను దెలుపు కోదండపతికృత వచనమును వ్రాసి, తరువాత "ఇందు నుదాహరణము 'నన్నేటికి బొమ్మ్మనేరా వానికద్దిక ౧" అనునట్టి స్వంత రచనలను చేర్చినాడు ఈ వచన భాగమంతయు శృంగార రసమంజరి కర్త వ్రాసినదే దీనినే క్లుప్తపరచి మొదటి భాగముగా (319—87 పేజీలలో అచ్చువేసినది) ఈ సంపాదకుడు వేరే వ్రాసియున్నాడు అందుచేత నీ వాక్యములలో కొంత భేదమున్నది (పట్టికలు ప్రక్క పుటలో)

ఈ మూడు పట్టికలను, శృంగారరసమంజరి భాగమున క్షేత్రయ్య పదములలో, గ్రంథ విస్తరభీతిచే ముద్రించలేదు విషయమంతయు లక్ష్య విభజనయం దిక్కుబడినదేగదా యని ఈ విభాగములు గల పట్టికలను అచ్చువేయుట మానుటరైనది కాని ఇప్పుడు ఈ శృంగార రసమంజరి కర్త యెవరను నిరూపణ విషయము వ్రాయుచుంటిని గాన కర్తలిద్దరు కలరని, మొదటివారు కోదండపతికవి యని, రెండవవారు ముఖ్య గోపాల పదములను, ఇతర పదములను శోధించి వాటికి లక్షణములను నిర్ణయించి విధిరీతుల విషయవిభాగ మొనర్చినవా రని చెప్పవలసి వచ్చినది గాన, ఈ యజ్ఞాత పురుషునిగురించి వివరముగా వ్రాయుటకై ఈ పట్టికలను కొంత ఉదహరించియున్నాను

ఈతడు కోదండపతికవికంటె బాగా తరువాతి ఆధునికుడైయుండును ఏమనగా, మొదటి పట్టికలోని అచ్చు గ్రంథములలోని రెండవదానిలో గల అంకెలనుబట్టి పదములను సరిచూడగా క్షేత్రయ్య పదములకు వ్రాసిన తొలిపలుకులోని 85 పుటలో ఉదహరించిన 1862 లో ముద్రితమైన గ్రంథములోని పద సంఖ్యగా కనిపించుచున్నది. అందుచేత ఈతడు 1860 ప్రాంతమునకు తరువాతనే వ్రాసియున్నట్లు చెప్పవలెనేమో. 1862 వరకు పూర్వమచ్చైన గ్రంథమేదైన యొకటియుండి యందును ఇదేరీతి పదసంఖ్య యుండినచో 1862కు పూర్వుడని చెప్పవచ్చును ఈతని పేరు, ఊరు, కాలము ఇప్పటికి నాకు తెలిసినంతవరకు నిర్ధారణ కాలేదు.

వికృతి మాఘమాస 'భారతి'లో 162 పుటలో శ్రీ తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు సభాపతయ్య పదములగురించి వ్రాసిన వ్యాసములో ఇట్లు ఫుట్ నోటులో వ్రాసియున్నారు " క్షేత్రయ్య పదములతో చేర్చి ముద్రించిన 'శృంగారరసమంజరి'ని రచించినదియు, క్షేత్రయ పదములలో గొన్నిటికి నాయికా, నాయక రసభావాది నిర్ణయము గావించినదియు, నీ పదములకు (సభాపతయ్య పదములకు) వివరణాదికములు వ్రాసి ప్రకటించిన శ్రీ నీ మా. తిరువెంకటాచార్యులవారే యని తెలపదగియున్నది. వేఱువిధమయిన ప్రామాణికాధారము లభించునంతవరకు నీ యూహ సరియయినదే యనుటకు బయి ప్రకటనములోని వాక్యముయొక్క సాక్ష్యము చాలు ననుకొందును"

పైన నేను వివరించినదానిబట్టి 'శృంగార రసమంజరి' కర్త గుడిపాటి కోదండపతి యని సప్రమాణముగా చెప్పవలసియున్నది రెండవవా రెవరను విషయములో విషయసామ్యమునుబట్టి శ్రీ తిరువెంకటాచార్యులవా రయిన కావచ్చును కాని, సభాపతయ్యగారి పదములను 1884 మార్చి నెలలో చెన్నపట్టణములోని శ్రీవాణీనిలయ ముద్రాక్షరశాలయందు ముద్రించనైనది అందీ పదములకు 'శ్రీ తిరువెంకటాచార్యులవారు సంగ్రహించిన యాంధ్ర వాక్యరూపమయిన నాయికా నాయకాది లక్షణములును, రసమంజరి యుదాహరణ శ్లోకములును నొసగబడియున్నవి' పరిష్కర్తలచే 'గ్రంథమునకు దొలుత గావించబడిన ప్రకటనము'లో ఇట్లున్నదని తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారి వ్యాసములో గలదు.

౬. . భావజ్ఞేతరులకు సమితము విశదపడునట్లు ముందు ఉపోద్ఘాతమును, ఆవతల రాగము, తాళము, పదము, నాయకి, నాయకుడు, రసము, సంచారీభావము, అలంకారమును, ఒకటి వెంబడి నొకటి క్రమముగాను — కడపట రసమంజరీ శ్లోకోదాహరణములను చేర్చి—అతిప్రయాసమునకు నెఱుదీయక

## పట్టికలు *

*I* మరియు, నీ సంపాదకుడు, ఇంక కొంతో క్రమదీపికవి లక్షణములకు లక్ష్యములుగా తా నిచ్చిన పదములను అకారాదిగా ఒక పట్టీలో నిచ్చినాడు. అందులోని క్షేత్రయ్యపదములకు తాను సంపాదించిన రెండు అచ్చుప్రతులలోను, రెండు వ్రాతప్రతులలోను నిర్ణ్వయబడిన పదసంఖ్య నిచ్చి నాయికా భేదములను కూడ ఇచ్చియున్నాడు ఉదాహరణముకై కొన్ని పంక్తులను వ్రాయుచున్నాను.

*II* ఈ విషయము నే మరియొక రీతిని విభాగించి పట్టికగా వ్రాసియున్నాడు. లక్షణములలో చేర్చొన్న కయసలోగల వివిధనాయికాదులను వరుసగా చెలుపుచు లక్షణమునకు ఎదురుగా లక్ష్యముయొక్క ప్రారంభము నిచ్చినాడు

*III* మరియు ఈ విషయము నే ఇంకొకరీతిని పట్టికగా ఇచ్చియున్నాడు

| (1) లక్ష్యము | అచ్చు | | వ్రాత | | లక్షణము |
|---|---|---|---|---|---|
| అందగాడనొడు వేర అదివరావా | ౧౪ | ౧ | ౪౭ | ౧౫౫ | సామాన్య, ఖండిత |
| అనుకొ ప నేమున్నది-యక్కర | ౭ | ౧౧ | ౨౫ | ౬౩ | స్వీ ప్రౌఢ దివ్య |
| పరదేశమున జేసిన పసులిందు | ౧౨౬ | ౧౫౩ | ౩౧ | ౭౦ | స్వీ ప్రౌఢ ప్రేమగర్విత |
| మంచిదాన వే చెలియ మాటలకు | | | ౬౧ | ౨౨౦ | ప పరోఢ ఉపపతి కతకు పరిహాసం |

| (2) లక్ష్యము | నాయికా భేదము |
|---|---|
| వచ్చేటిక బొమ్మసేర, వాని వద్దిక | స్వీయ, ముగ్ధలో, నవోఢ |
| ఈ మేను జీవునకు యింత ప్రియమాయెవ్ | స్వీయ, ప్రౌఢ-విప్రలబ్ధ |
| అలుకటీరెనా నేడైన మా | స్వీయ, సఖిప్రౌఢ-పరిహాస లక్షణము |
| ఇటువంటివాడని నే దెలియ | ప, పరోఢ-గురుమాన |
| దినము లిటుకరె వచ్చె | సా ; మధ్యము |
| ఇంత దయగలవాని | సా, దూతీసంఘటన |

### మువ్వగోపాలపద నాయికా పట్టీ

| (3) | స్వీయ | పరకీయ | సామాన్య |
|---|---|---|---|
| ప్రౌఢ-తృప్త<br>ప్రౌఢ-అతృప్త | నేటికే కలయికరా<br>నన్ను నీవు దలచేది న్యాయ | ఇప్పటికిలాగున నున్నా<br>ముద్దుపెట్టకేవుగా | మనసు నిన్నుడనాయ<br>ఒకసారికే ఈలాగైతే |
| సౌందర్య గర్విత | తోయ్యలి వానిభూడన్వ | తెలియనైతి నమ్మ | గడియ గడియకు |
| ముగ్ధ-స్వాధీనపతిక | ఇన్నాళ్ల మల్లాడిన దిందు | అక్కరో ఓర్వనివారు | సామికి పరిమావ్వరే |
| ముగ్ధ-విప్రలబ్ధ | కొంచెకత్తెలా మీరు | ఎక్కడి కేస్తను ఠెక్కడి నెవరు | ఒక్కనైన కాని నాయకుడు |
| సఖీ-ఉపాలంభన | మగవాని కట్టపెట్ట మనవకేమా | నెలతా అతడు అలిగెనే | పిలవచ్చితివే సామినాడకాకి |
| ... ... | | | ... |

వ్రాసి అచ్చువేయించి ప్రచురించితిమి ఇందు వ్రాయబడియుండు లక్షణములు భరత రసప్రకరణము లోని శ్లోకములకు తెనుగు తాత్పర్యము గాని వేరు కాదు అలంకార లక్షణములను తెలుపునపుడు చంద్రాలోకములోని శ్లోకములను తెలుగు మాటలుగా మార్చి వ్రాసియున్నాము ఈ లక్షణములకు సంస్కృతమునందు చూడవలెనన్న భరత రసప్రకరణమును చంద్రాలోకమును చూడవలయును క్షేత్రయ్యగారి పదములు మొదలయినవానిలో లక్షణోక్తములైన కొన్ని పదములను సంగ్రహించి యుందలి లక్షణముల తోడ కూర్చి ముద్రింప యత్నించియున్నాము"

దీనినిబట్టి 1884 నాటికి ముద్రింప యత్నించి యున్నట్లు తెలియుచున్నది అప్పటికే దీనిని వ్రాసి యుండవచ్చును పైన నేను సూచించిన రీతిని ఈ యజ్ఞాత రచయిత 1860 ప్రాంతములయందే రచియించి యుండు నేమో యని ఊహింపవలసియున్నది మరియు రెండు అచ్చుపుస్తకములలోను ఒకదానిలో 160 రెండవదానిలో 200 పదము లుండెనని పట్టికను బట్టి చెప్పవలసియున్నది 1862లో అచ్చువేసిన గ్రంథమందు 228 పదములుండెను మొదట 200 లే దొరికినవని, విచారించగా ఇంకను 28 లభ్యమైనవని అందు ప్రకటింపబడియున్నది అందుచేత 200 గల ఒక పుస్తక మంతకంటె పూర్వమున యుండియుండె నేమో యని తోచుచున్నది అందుచేత 1884 నకు అధమ మిరువదేండ్ల క్రిందట, ఈ యజ్ఞాత పురుషుడు, ఈ పట్టీల వ్రాతలను వ్రాసియుంప వచ్చునేమో యని తోచుచున్నది మరియు అతను వ్రాసిన వ్రాత ప్రతిలో నాటి కచ్చులోలేని క్షేత్రయ్య పదములను సుమారు 90 పైని వ్రాసియున్నాడు

మరియు, సభాపతయ్యగారి పదములకు వ్రాసిన వివరణాదికముల గురించి శ్రీ తిరువేంకటాచార్యుల వారు వ్రాసినది పై నుదహరింపబడినది. అందలి లక్షణములు, భరత రసప్రకరణము, చంద్రాలోకములోని సంస్కృతలక్షణశ్లోకములకు తెనుగని చెప్పబడి యున్నది ఈ యజ్ఞాత సంపాదకు డుపయోగించిన లక్షణములు గుడిపాటి కోదండపతి రసమంజరికి వ్రాసిన తెలుగు వచనరచన కాని, భరతరసప్రకరణ, చంద్రాలోకములలోని సంస్కృత విషయమునకు శ్రీ తిరువేంకటాచార్యులవారు వ్రాసిన వచనరచన కాదు ఈ ఆచార్యులవారే యీ యజ్ఞాత పురుషుడైనచో ఈ సభాపతయ్య పదములలో వ్రాసిన తెనుగు లక్షణములనే యిచ్చియుండును ఏమనగా వారి ప్రకటనమందు చివర ఇట్లు వ్రాయబడినది "క్షేత్రయ్యగారి పదములు మొదలయినవానిలో లక్షణోక్తము లయిన కొన్ని పదములను సంగ్రహించి యుందలి లక్షణములతోడ కూర్చి ముద్రింపయత్నించి యున్నాము" ఈ లక్షణము వేరు గనుక, శృంగార రసమంజరిలోనివి, గుడిపాటి కోదండపతిచే వ్రాయబడినవి గనుక, వాటిని అజ్ఞాత సంపాదకు డుపయోగించియున్నాడు గనుక, ఆచార్యులవా రీ యజ్ఞాత పురుషులు కారని తోచుచున్నది

మరియు సభాపతయ్య పదముల వివరణ ప్రణాళికకు 'శృంగార రసమంజరి' రెండవభాగమందలి వివరణ ప్రణాళికకు భేదము కనపడుచున్నది, ముఖ్యముగా, సభాపతయ్య పదముల వివరణలో "కడపట రసమంజరీ శ్లోకోదాహరణములను జేర్చి" యని యున్నది ఇవి సంస్కృతమున మాత్ర మిచ్చిరో, తెలుగులో శృంగార రసమంజరి కర్త యగు కోదండపతి ఆంధ్రీకరణముకూడనిచ్చిరో తెలియదు (గ్రంథము లభింపక చూడలేదు) ఎట్లైనను అజ్ఞాత పురుషుడు శ్రీ తిరువేంకటాచార్యులవా రనుటకు ఇవి బాధకరములనియే నా యూహ అందుచే యీ విషయ మింకను ఇదమిత్థమని చెప్ప వీలులేకున్నది.

---

శ్రీ విస్సా అప్పారావు.

## [illegible]మేశ్వర రసాయనం

ఇది రక్తవృద్ధిని చేయు విలువ గల వస్తువులచే తయారు చేయబడినది. మేహములు, ని[illegible] విస్మృతులు, శుక్లనష్టము, అతిమూత్రము మొదలగు వాటిని ఖండించి, మంచి బలము వీర్యపటుత్వము కలిగించుటలో అద్భుతమయినది. అనేక సర్టిఫికెట్లు గలవు. 2 డబ్బీలు చాలును

20 తులముల డబ్బీ రు. 2/-

పోస్టేజి ప్రత్యేకము

**పి. సి. ఏ. అండ్ కంపెని**

ఆయుర్వేద సమాజం

పెరిదేపి, (నెల్లూరు జిల్లా)

---

లోకప్రసిద్ధిపొందిన

## పి. వి. రాజన్ అండ్ కంపెనివారి




శ్రేష్ఠమైన మదరాసు నశ్యం

**R. S. సుగంధ ముక్కుపొడి**

అన్నిటిలో సాటిలేనిది

ధర వివరములకు వ్రాయుడు

తయారుచేయువారు —

**పి. వి. రాజన్ & కంపెని,**

ఆర్కోణం, Arkonam, N A Dt.

---



సంపాదకుడు

శ్రీ వ్యాఖ్యానపురాణసర్వతీర్థ

కలగ ఆంజనేయశాస్త్రి

---

## కుష్ఠు ★ బొల్లి

వగైరా మేహమచ్చలు, సెగ. నవాయి వ్యాధులకు గ్యారంటీ చికిత్స, క్యాటలాగు ఉచితము.

---

**జి. ఏ. రెడ్డి అండ్ కో**

(రిజిష్టర్డు)

“ధాన్వారాశ్రమము”

గోపాలపురం, తూ. గో. జిల్లా

# గ్రంథవిమర్శనము

## గాంధీ—మార్క్స్

శ్రీ కిశోరీలాల్ మష్రువాలా—అనువాదకులు వేమూరి ఆంజనేయశర్మ ప్రకాశకులు సర్వోదయ సాహిత్య ప్రకాశన సమితి హైద్రాబాదు దక్కను వెల రూపాయిన్నర

ఈ రోజుల్లో కమ్యూనిజాన్ని గురించి విరివిగా చర్చలు సాగుతున్నాయి అల్లాగే గాంధీతత్త్వాన్ని గురించి వేర్వేరుగా చర్చించిన పుస్తకాలనేకం ఉన్నాయి ఈ రెంటినీ గురించి సమగ్రపరిశీలనచేసి తారతమ్యం చూపించిన గ్రంథాలు తెలుగులో లేవే లేవని చెప్పవచ్చును ఇందుచేత ఈపుస్తకం తెలుగు పాఠకుల కెంతైనా ఉపయోగపడగలదు

కిశోరిలాల్ మష్రువాలా ఈ పుస్తకంలో గాంధీవాదాన్ని గురించి, కమ్యూనిజాన్ని గురించి తారతమ్యపరీక్ష చేసి ఈ రెండింటినీ గురించి సమగ్రంగా చర్చించారు

గాంధీవాదానికీ, కమ్యూనిజానికీ లక్ష్యాలు ఒకటే కావచ్చును కాని ఆచరణలో రెండిటికీ ఉత్తరదక్షిణ ధ్రువాలకున్నంత భేదా ఉంది గాంధీ ఆధ్యాత్మికవాది అందుచేత ఈయన దృక్పథంలో ఈశ్వరవిశ్వాసము, అహింస మొదలయినవాటికి ప్రాధాన్యం ఏర్పడుతుంది

మార్క్స్ గతితార్కిక భౌతికవాదికావడం వల్ల ఇతని వాదంలో పై విషయాలగోలే కనబడవు కాని, ధనస్వామ్యసమాజం తనలో సహజంగా అంతర్గతములై ఉన్న విరుద్ధశక్తులద్వారా, వర్గకలహం ద్వారా వర్గరహిత వ్యవస్థవైపు ములుపు తున్నదనీ, తీవ్రమైన ఆందోళనద్వారా వర్గరహిత సమాజంస్థాపనకోసం ప్రయత్నించడమే విప్లవపంథా అవుతుందనీ మార్క్స్ అభిప్రాయము ఇతని అభిప్రాయంప్రకారం ఈవిధమైన సమాజస్థాపనకు సాయపడని కార్యక్రమం అంతా విప్లవ వ్యతిరేక పంథాయే అవుతుంది

గాంధీమార్క్సుల ఇద్దరి దృక్పథాలలోను ఒక ప్రధానమైన విభేదం కనబడుతుంది సాధన గతమైన గుణదోషాలు సాధ్యంలోకూడా సంక్రమించి తీరతా యని గాంధీ సిద్ధాంతము, అందుచేత ఒక లక్ష్యసిద్ధి కోసం అవలంబించే సాధనం కూడా పునీతంగానే ఉండాలని గాంధీజీ అంటాడు మార్క్స్ దృక్పథంలో ఒక లక్ష్యంతసమాజ శ్రేయస్కరమైనప్పుడు



దానికోసం అవలంబించే కార్యాచరణ ఎల్లాంటి దైనా దానివిషయంలో ఆక్షేపణ ఏమీ ఉండదు

మార్క్స్ దృక్పథం జీవితానికంతటికీ సంబంధించినది గాంధీజీ సిద్ధాంతం ఒక్క రాజకీయ స్వాతంత్ర్యసంపాదనకోసమే ఉపయోగపడిందని అనుకోకూడదు ఇదికూడా జీవితంలోని ప్రతిసమస్యకు ఒకనిర్దిష్టమైన దృక్పథంఏర్పరుస్తుంది. అయితే మార్క్సిస్టు మూలాల ప్రకారం అన్ని జీవితరంగాలలోను ఏర్పడే దృక్పథాలను గురించి సమగ్ర చర్చజరిగిఉండడంవల్ల అది సులభంగా తెలుసుకోడానికి వీలేర్పడుతున్నది

మష్రూవాలా అవిశంగా కళాది వివిధరంగాలలో ఏర్పడే గాంధీ దృక్పథాలను గురించి ఈ పుస్తకంలో వివరంగా చర్చించి ఉండలేదు—పైగా ఈ పుస్తకంలో మార్క్సిజం ఒకే సుస్థిరమైన దృక్పథంతో వివరించినట్లుకూడా కనబడుతుంది

ఈ పుస్తకం చదువుతూంటే చాలా చోట్ల తెలుగు హిందీ అనువాదంలా కనబడిపోతూంటుంది. అనువాదకులీ లోటు ముందు సంస్కరణలోనైనా సవరించుకోగలరని ఆశిస్తున్నాను

## జాతిరత్నాలు

[కథలసంపుటి]

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి. సుశీలవాడి, హుమాయత్ నగర్, హైదరాబాద్, (దక్కన్) వెల రూపాయిన్నర

ఆంధ్రదేశంలో సుప్రసిద్ధమయిన స్త్రీలపాటలలోని కొన్ని ఇతివృత్తాలు తీసుకుని శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారు సరళగ్రాంథికభాషలో అయిదుకథలు వ్రాశారు ఈ ఆ అయిదు కథల సముచ్చయమే ఈ 'జాతిరత్నాలు'

ఆంధ్రదేశీయమైన ప్రాచీన జానపద మహిళా సారస్వతంలో చక్కని జాతిరత్నాలున్నా, అవి ఇంతవరకు అచ్చుతప్పుల తడకలుగా వెలిచిన గుజిలీ పుస్తకాలలోనే నామ మాత్రంగా మిగిలి ఉన్నాయి వీటినిగురించిన పరిశోధన చాలా స్వల్పంగా జరిగింది చింతాదీక్షితులు గారు మొదలైనవారికో ఇద్దరు ముగ్గురు మాత్రమే వీటినిగురించి కూలంకషమైన పరిశ్రమచేసి వ్యాసాలు ప్రచురించారు.

శ్రీ సరస్వతీదేవిగారు పాత పాటలలో నించి ఎన్నుకొన్న ఈ అయిదు ఇతివృత్తాలలోను చక్కని

ఆంధ్రదేశీయమైన సంప్రదాయం తొణికిసలాడు తున్నది. వీరు స్వీకరించిన, కుర్మిణాదేవినిద్ర, లక్ష్మణదేవరనవ్వు, సర్వాంగదచరిత్ర, సర్మరాజు వాదము, సత్యభామ సరసము, సుప్రసిద్ధమైనవి

శ్రీమతి సరస్వతీదేవిగారీ కథలన్నీ గ్రాంధికంలోనే వ్రాసినా—కథలలో చాలాచోట్ల ఆయా పాటలలోని ఘట్టాలెన్నో ఉదాహరించారు ఈ ఉదాహరణవల్ల, సహజమైన కథ చాతుర్యంవల్ల ఇవి చదువుతూంటే—ఆ పాత పాటలు చదువు తూన్నట్టే ఉంటుంది ఈ పాటల పారశ్యము, కథా కథనవైఖరి కొన్ని కొన్ని చోట్ల ఉత్తమ కవితా స్థాయి స్ఫురింపజేస్తాయి లక్ష్మణదేవర నవ్వులో నిద్రాదేవి తన్నుగురించి చెప్పేమాటలు దీనికి ఉదాహరణగా తీసుకోవచ్చును

"అష్టదిగ్గజములను – ఆది మహాబుషుల
వైకుంఠవాసులను వదియింతు నేను
సప్తసాగరముల చవుటి పడియలను
కోటిగనదులను భ్రమియింతు నేను
పక్షుల జాతులను పర్వతమ్ములను
వృక్షాలపైనుండి విహరింతు నేను
నరుల నెవ్వారును నను గెల్వలేరు"

ఈ కథలు చదువుతూంటే సహజంగా పాఠకులకు వీటికి సంబంధించిన పాతపాటలు చదవాలనే కుతూహలం కూడా కలుగుతూంటుంది

ఇల్లిందల సరస్వతీదేవిగారి 'జాతిరత్నాలు' అనునిక కథాభిమానులే గాక ప్రాచీన జానపద మహిళా వాఙ్మయాభిమానులు కూడా తప్పక చదవతగినవి పుస్తకం ఈ రచయిత్రి క్రమంగా ఉత్తమమైన ప్రాచీన స్త్రీసారస్వతంకూడా ప్రకటింపగలరనీ, అవిస్పంగా మరుగున పడిపోతున్న ప్రాచీన మహిళా వాఙ్మయమాధుర్యం తెలుగువారికి అందించగలరనీ ఆశిస్తున్నాను—

ఈ గ్రంథానికి శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు వ్రాసిన పీఠిక వారి విశేష పాండిత్యానికి నికషోపలంగా ఉన్నది

---

## విజయదశమి

[పదికథల సంపుటి]

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి ప్రచురణ: కాకుబుక్ డిపో, రాజమండ్రి. వెల రూపాయిపావలా దీనిలో విజయదశమి, నలుగుపిండలు, మానసుందరి మొదలైన పది కథలున్నాయి ఇవి అన్నీ ఇదివరకు సుప్రసిద్ధపత్రికలలో ప్రకటింపబడినవే అని పీఠికారచయితలు శ్రీదేవరపల్లి కేశవరావుగారు వ్రాసున్నారు.

వీటిలో ఎక్కువగా కూలినాలి చేసుకొని జీవించే బీదజనం, మధ్యతరగతి ప్రజ, పాత్రలుగా వస్తారు

ఈ రచయితలో చక్కని కథనశక్తి ఉన్నది జాతీయము, సుసంస్కృతము అయిన చురుకైన వ్యావహారిక భాషకూడా వీరి కథనశక్తికి తోడై కథలన్నీ ఒక గుక్కలో చదివించివేస్తుంది

అయితే చాలావరకీ కథలన్నిటిలోను రచయిత వ్యక్తిత్వం మాటిమాటికీ పాఠకులకు అడ్డు తగులుతూ ఉంటుంది ఒక్కొక్కప్పుడు పాత్ర సంభాషణలు మొదలైనవన్నీ రచయితముఖతః బయలుదేరుతున్నట్టే వినిపిస్తాయి మరీఅడుగున పడిపోయిన వ్యక్తులకథనలో రచయిత వారి జీవితాలనుగూర్చి ఊహించి చిత్రిస్తున్నట్టు కనిపిస్తుంది

ఈకథలన్నిటిలోను 'నలుగుపిండలు' 'మస్సులో' అనేవి రెండు చాలా మంచికథలు పుస్తకం ముద్రణాదికం ప్రశస్తంగా ఉన్నది

---

## శ్రీమద్రామాయణోత్తరకాండ

[కవిత]

జటవల్లి కృష్ణమాచార్యులు కొటిపాక, రాజోలు తాలూకా, వెల 3 రూపాయలు

ఈ రచయిత పాలం దున్నతూండగా ఒక నిక్షేపం దొరికిందట! ఆ నిక్షేపంలో ఒక సంస్కృత తాళపత్రగ్రంథం మాత్రమే కనిపించిందట ఆ గ్రంథంలోని కథ ఆధారంగా తీసుకుని రచయిత ఈ పద్యకావ్యం రచించారు దీనిలోని కథకు ఉత్తరకాండ కథకు అక్కడక్కడ కొన్ని భేదాలున్నాయి

ఈ రచయిత కావ్యం సాంప్రదాయిక కవితా మార్గంలో నడిచిపోతుంది పద్యాలలోని సంస్కృతాంధ్ర పదప్రయోగాల శిష్టత ప్రత్యేకంగా ప్రశంసింపదగినది కవిత అంతా కథాకథన ధోరణిలో సాధారణస్థాయిల్లోనే నడిచిపోతుంది గాని రసవత్తర ఘట్టాలలో తీవ్రమనుపైన కవితాగాంభీర్యం గాని కవితలో ప్రత్యేకత గాని కనబడదు

ఈ క్రింది పద్యాలు వీరి శైలికి ఉత్తమోదాహరణలుగా తీసుకోవచ్చును ఇది తృణబిందాశ్రమవర్ణన ఘట్టము

"కెవ్వున కేక వేయుదురు,
కీరములాక మయూర కోరికల్
జివ్వున రేగిపాటు, జెలరేగియు
దేవియలాడుచుందు ౙా

